# కృతజ్ఞత

ఇందలి 'నా ట క క ళ' అను వ్యాసము నేను 1957 వ సం॥లో ఆంధ్ర విశ్వకళాపరిషత్తు జరిపిన Summer School of Extension Lectures అను కార్యక్రమమున యిచ్చిన ఉపన్యాసముల రూపాంతరము. దయతో నాకాయవకాశము గలిగించి, యిపుడీ వ్యాసమును ప్రచురించుకొనుటకనుమతించిన మా విశ్వకళాపరిష దుపాధ్యక్షులు డాక్టరు శ్రీ వి. యస్. కృష్ణా B.A., (Hon.) Ph.D. (Vienna) గారికి, శ్రీ కె. వి. గోపాలస్వామి M.A., (Oxen) Bar-at-law గారికి నా కృతజ్ఞతాపూర్వకాభివాదములు.

గ్రంథకర్త.

# విషయసూచిక

---

పేజీ నెం.

# నాటకకళ

(వివిధ ముఖ్యదేశములలోఁ దదుత్పత్తి వికాసములు)

## 1. ప్రాచీన యుగము

(క్రీ॥ శ॥ 4.5 శ॥లకుఁ బూర్వము)

**ఉపోద్ఘాతము :—**

నిత్యము పచ్చిబాలెంతరాలైన ప్రకృతి సవిత్రికి స్తనంధయుఁడైన ప్రాక్తనమానవుఁడా మాతృహృదయ మాధుర్యమును జూరఁగొని కొట్టిన కేరింతయే మానవజాతి గానకళాభ్యుపాసన కుపస్సంకల్పమైనది. తనకంఠమునుండి వెడలిన మధుర స్వరములెవో తన కర్ణఘటములలోనే పడి మఱల తనలోనే ప్రవేశించి మారెలుఁగిచ్చినట్లు తన నాడీతంత్రులలోఁ గలిగించిన కదలికయే యతని కరచరణాలనుండి బహిర్గమించి నృత్యకళాసరస్వతసాక్షాత్కారమునకుఁ బ్రథమ పురస్కారమైనది. ఆటపాటలలో నపుడపుడే ప్రవీణుఁడై నిరంతర వర్ధమానుఁ డగుచుండిన మానవుని యనుకరణప్రవణశీలము నందులో నంతర్భూతమైయున్న సృజనకళాకౌతూహలము బొమ్మలాటకు నాటకకళకుఁ బురుడుఁ బోసినవి. నాటకకళ ప్రాదుర్భావ దశలో మతాశయప్రతిపత్తి బీజకమే యయినను నానాఁట వినోదకాలక్షేపముగాఁ బరిణమించి విజ్ఞానప్రచార సాధనముగాఁ గూడఁ బరిఢవిల్లుచు వచ్చినది. ఆప్రాక్తన మానవుని సంతానమే ప్రపంచములో వివిధప్రదేశములలో శాఖోపశాఖలై విభిన్నకళాభిరుచులతో విరాజిల్లుచు వచ్చినది. ఒక్కొక్కజాతి నాగరికమై దానిభాష సాహిత్యస్థితికి

వచ్చినతరువాత నందులోఁ గొంతకాలమున కాయాజాతికి సహజమైన గీతాభినయకళాభిరూన ప్రత్యేకతలకుఁ దార్కాణ మైన కావ్యజాలము వెలయును. ఆవిధమున మొట్టమొదటగా నాటకసాహిత్యమును సృజించి నాటకకళకు స్థిరప్రతిష్ఠను గలిగించిన జాతులు గ్రీకు, రోమను భారతజాతులు. మొదట నాయా దేశములలోని ప్రాచీన రూపకోపస్థితి యేవిధమున నుండెనో పరిశీలింతము.

౧. గ్రీకు నాటక కళ :—

ప్రాచీన కాలములోఁ బాశ్చాత్య ప్రపంచమునకు విజ్ఞానప్రసార కేంద్రముగా నుండినది గ్రీసు దేశము. అది యానాఁడు భారతదేశమువలెనే వివిధ తాత్త్విక దృక్పథము లకుఁ బుట్టినిల్లు. కళలకుఁ గాణాచి. సాహిత్యమునకుఁ బట్టు కొమ్మ. పాశ్చాత్య దేశము లన్నిటిలో మొట్టమొదట నాటక కళ కాటపట్టయినది గ్రీసు దేశమే. అతి ప్రాచీనకాలమునుండి గ్రీసు దేశీయులు ద్రాక్షపంటలకాలములో వసంతోత్సవములు జరుపుకొను చుండెడివారు. ఆ యుత్సవములకు మదిరా ప్రభు వైన 'డయొనిసస్' అధిష్ఠానదైవము. అతనిని మేషబలి పూర్వకముగా సత్కరించి ద్రాక్షాసవపాన సంతోష స్వాం తులై వసంతోత్సవములు జరుపుకొను గ్రీకుజనులలో నొక యేఁబదిమంది యేకముఖముగా ముక్తకంఠముతో నతనిని కీర్తించుచు జరుపు బృందగానమునకు 'డితీరాంబ్' అనిపేరు. అనఁగా నదంతయు దైవప్రీత్యర్థము, మతవిషయికము నయిన యొక జాతరవంటిదన్నమాట. అది గ్రీకు నాటకకళా ప్రాథ మిక స్వరూపము.

తరువాత బయలుదేఱినవి ట్రాజెడీకామెడీలు. అనఁగా విషాదాంతమోదాంత నాటకములు. మొదట విషాదాంతమే బయలుదేరుట యొకవిశేషము. ఆనాఁటి గ్రీకు ట్రాజెడీ యనఁగా 'Funeral performance at the grave of a warrior' అని ప్రొఫెసరు రిడ్జివే. అనఁగా నొక మృత యోధుని సమాధివద్ద జరుగు నపరకర్మ కలాపమని యర్థము. అసలు ప్రపంచములోని వివిధ జానపద నాట్యకళా ఫక్కిక లను గుఱించి పరిశోధనలు జరిపిన రిడ్జివే మతముప్రకారమా ఫక్కికలన్నిటికిని మీఁదఁజెప్పిన కర్మకలాపమే సామాన్య ధర్మమని చెప్పవలసివచ్చును. క్రీ. పూ. 534 ప్రాంతములో 'థెస్పిస్' అను గాయక బృందనాయకుఁడు ట్రాజెడీ రచన కంకురార్పణ చేసినట్లు తెలియుచున్నది. అతఁడే మొదట గాయక బృందముతో పాటొక నటునిఁ బ్రవేశపెట్టెను తరువాతఁ గొంతకాలముపాటు ట్రాజెడీ రచన 'థెస్పిస్ మార్గముననే సాఁగినను 'ఫ్రినికస్' అను కవి రచనలలో స్త్రీ పాత్రలు, సమకాలికేతి వృత్తములు కనుపించినవి క్రీ. పూ. 500 ప్రాంతములో 'ఐస్కిలస్' అను గొప్పట్రాజె రచయిత యుద్భవించినాఁడు. అతఁడు హోమరు మహాక గాథాప్రపంచమునుండి చక్కని యితివృత్తములు గ్రహిం నాఁడు. తన ట్రాజెడీలలో నిద్దఱు నటులను బ్రవేశపె నాఁడు. బృందగానమును సర్వోపభోగ్యముగాఁ జేసినాఁడు తన నాటక ప్రదర్శనముల నాబాలగోపాలమున కందుబాట లోనికిఁ దెచ్చినాఁడు. తాను స్వయముగాఁ బాత్రధార చేసెడివాఁడు. తన నాటకములను రాజధానీ నగరములో

బోటీల కెక్కించి బహుమానములు కూడ పొందినాఁడు. అతని కించుక యర్వాచీనుఁడైన 'సాఫొక్లిస్' కాలములో ననఁగా క్రీ. పూ 495-405 సం॥ల నడుమ గ్రీకు ట్రాజెడీ చక్కని శైల్పికమైన యభ్యుదయమును బొందినది. ఆ రోజులలో నతని నాటకములను మెచ్చుకొనుట యొక నాగరికమైన యభిరుచిగాఁ బరిగణింపఁబడెడిది. ఇతఁడు తన ప్రదర్శనాలలో ముగ్గురు నటులను బ్రవేశపెట్టెను. రంగస్థలమునకు మంచి హంగు చేసినాఁడు. గాయకుల సంఖ్య హెచ్చించినాఁడు. తన నాటకభాషను నిత్యజనవ్యవహారముల కతి సన్నిహితముగ తెచ్చినాఁడు. అతని కించుమించు సమకాలికుఁడైన 'యూరిపిడిస్' (క్రీ. పూ. 480-406) అను నాటక కర్త మఱికొంత పరిణామమునకు దారితీసినాఁడు. బృందగానమును నాట్యాంగమునుండి వేఱుపఱచినాఁడు. ప్రాస్తావిక గీతి నసలు నాటకమున కొక యర్థవంతమైన యుపోద్ఘాతముగాఁ దీర్చి దిద్దినాఁడు. తన నాటక భాషను, నితివృత్తగతములైన విషయములను, నాశయములను తన కాలమునకు దీటుగా వాస్తవికతకుఁ జాల సన్నిహితముగా నుండునట్లు చేసినాఁడు. కాని యతని కొక పరిపాటి యున్నది. నాటకాంతములో మానవాశక్యములైన సమస్యాపరిష్కారముల కాకస్మికముగా నేదేవునినో తెచ్చిపెట్టెడివాఁడు. అది కొంత విడ్డూరమనిపించును. మొత్తమున కీ 'ఐస్కిలస్', 'సాఫొక్లిస్', 'యూరిపెడిస్', ఈ ముగ్గురే గ్రీకు ట్రాజెడీకి మూలస్తంభములవంటివారు. ముగ్గురు నొక్క శతాబ్ది కాలములో మూఁడు వందల ట్రాజెడీలు రచించినారు. లక్ష్యకోశమును బట్టి

వారి ట్రాజెడీ రచనా ప్రక్రియలో నాలుగంతస్తు లున్నవి. 1. Prologue అనఁగా ప్రస్తావన 2. Chorus అనఁగా బృందగానము 3. Episode అనఁగా సంకము లేక రంగము వంటిది. 4. Epilogue అనఁగాఁ జరమాంకము.

ఇఁక గ్రీకుకామెడీ సంగతి. ఇది జనపదములలో 'డయోనిసస్' ఉత్సవసందర్భములలో 'కోమస్' అనఁగా గీతాలాపన, 'గామస్' అనఁగా స్త్రీపురుష స్నేహబాధము, మధుపానగోష్ఠి, హాస్యప్రలాపము పశుపక్ష్యాది వేషధారణము మొదలైనవి కారణములు నుద్బోధకములుగ బయలు దేఱినది. ఇందులో మొదట కొన్నినాళ్ళపాటు 'ఫాల్లస్' అను పురుషచిహ్నమైన లింగధారణాచారమొకటి యుండెడిది. 'పారాబాసిస్' అనుపేర సామాజికుల నుద్దేశించి నాటకమధ్యములో నాఁటి రాజకీయ విషయవిమర్శకూడ జరుగుచుండెడిది. గ్రీసులో కామెడీకూడ క్రీ॥ పూ॥ 5 వ శతాబ్దిలోనే బయలు దేరియున్నను దానికిఁగూడ ట్రాజెడీ లక్షణములు కొన్ని పట్టియున్నప్పటికి నానాఁడు ట్రాజెడీ కున్న విపులప్రచార కారణముగా కామెడీకంత ప్రత్యేక వ్యక్తిత్వము లేకుండిపోయినది. అయితే అది క్రీ॥ పూ॥ 448–380 సం॥ల నడుమ 'అరిస్టోఫేన్సు' అను నొక ప్రౌఢ నాటకకర్త చేతిలోఁబడి చక్కని పరిణతిఁ బొందినది, కామెడీకళకు జీవము పోసినాఁడతఁడు. అతఁడు గ్రీకు కామెడీకారులలోఁ బ్రధానుఁడగుటయే కాదు. ఎన్నో శతాబ్దముల తరువాత యూరపుకు దక్షిణపు కొసనున్న గ్రీసుకు నుత్తరపు కొసనున్న ఇంగ్లాండులోఁ బుట్టిన బెంజాన్సన్,

మిడిల్టన్, ఫీల్డింగ్ మొదలగు నాటకకర్తలపైఁ దన ప్రభావమును బ్రసరింపఁజేసిన మహానుభావుఁ డతఁడు. అతని కాలములో కామెడీ ఏదో జానపదవినోదకాలక్షేపముగ నూర్చుండక ఏథెన్సు నగరమునకుఁగూడ నెగబ్రాకి నాఁటి నాటకపు పోటీలలో ట్రాజెడీకి బ్రతిస్పర్ధిగా నిలుచున్నది. అతఁడానాఁ డధికారమదోన్మత్తులైన, యాడంబరపరాయణులైన వ్యక్తులనుగూర్చి నాటకపు పోటీలలోఁ దనపూర్వులైన 'ఐస్కిలస్', 'యూరిపిడిస్'లు పడిన యవస్థలఁగూర్చి, న్యాయస్థాన వ్యవహారములఁగూర్చి మనోజ్ఞములైన వ్యంగ్యచిత్రణలతో కామెడీ లనేకము రచించినాఁడు. అరిస్టోఫేన్సు తరువాత గ్రీకు కామెడీ యింకను గొంత పరిణతిఁ బొందినది. క్రమముగా లింగధారణాచారము కోరస్లకుఁ బ్రాముఖ్యము తగ్గిపోయినది. పారాబాసిస్ నిషేధింపఁబడినది. అయితే పతనోన్ముఖముగానున్న సాంఘికవ్యవస్థను గురించి విమర్శ జరుగుచుండెడిది. అటువంటి వ్యవస్థకుఁ బ్రతినిధిప్రాయులైన కొందఱు వ్యక్తుల పాత్రలు ప్రవేశపెట్టఁబడి వాని ద్వారమున హాస్యధోరణి కొంత సాగుచుండెడిది. గ్రీకుకామెడీ చరిత్రలో నీ యనంతరీయుగ ప్రతినిధులు 'మినాండరు, ఫైలెమన్' అనెడివారు. వారు ప్రసిద్ధులైన రోమను కర్తలకుఁ గూడ ననుకార్యు లయినారు.

ఆనాఁడు రాచప్రాపుఁగల ఏథెన్సు నగరములోఁ దప్ప సాధారణముగా గ్రీకునాటకములు పల్లెటూళ్ళ యూరు బయళ్ళలోనే యాడఁబడుచుండెడివి. ఎవఁడో యొక సంపన్న

పౌరుఁ డనేక యాచారముగాఁ బ్రదర్శన ఖర్చు వెచ్చములను భరించుచుండెడివాఁడు. అయినను గ్రీసులో నాటక సాహిత్యమును గురించి జరిగినంత కృషి రంగస్థల విషయములో జరుగ లేదనియే చెప్పవలెను. గ్రీకు నాటకము ప్రధానముగా దేవతాతృప్తి, కథావశేషుఁడైన యొక మహావ్యక్తి నారాధించుట, యనునది పరమాదర్శ ప్రయోజనములుగా బయలుదేరినదనియు, నటువంటి మతాశయ ప్రతిపత్తి కవకాశము విశేషముగాఁ గల్పించిన దగుటచేత నానాఁటి గ్రీకులకు విషాదాంతములు మిక్కిలిగా నుపాదేయములైనవని చెప్పవలయును. మానవునిలో ననేక లోపముల కాకరములైన భయ విషాదప్రకోపావస్థల బారినుండి తప్పించి యతనినాత్మ పరిమార్జన సంకల్పమునకుఁ బురికొల్పుటకొఱకు నాప్రకోపములకే రూపకములోఁ బ్రాముఖ్యము కల్పింపఁబడినట్లు నదే యా విషాదాంతముల పరమార్థముగాఁ దోచుచున్నది గ్రీకు నాటక లక్షణమునకు అరిస్టాటిలు (క్రీ॥ పూ॥ 384–322) మహాశయుఁడు వ్రాసిన గ్రంథమే పరమప్రమాణము. అది దొరకినంతలో ప్రపంచనాటక లక్షణగ్రంథములలోనే మొదటిదని చెప్పవలయును. అది గ్రీకు నాటకమునకే కాక పాశ్చాత్య సాహిత్య ప్రపంచమంతటికి లక్షణభిక్షఁ బెట్టిన యన్నపూర్ణ.

అరిస్టాటి లెక్కువగా గ్రీకు విషాదాంత నాటకములనే దృష్టిలోఁ బెట్టుకొనినను నతని గ్రంథములో నాటక స్వార్వస్వమును సంబంధించిన కొన్ని ముఖ్యసిద్ధాంతము లున్నవి. అతని సిద్ధాంతములలో ముఖ్యమైనవి యనుకరణ

సిద్ధాంతము, నైక్యత్రయ సిద్ధాంతము. అనుకరణ పరాయణత్వమన్నది మానవునకు సహజము, నాబాల్యసిద్ధమునయినదనియు నాటకములో నటుఁడు చేయుపని యదే యను నదొక సిద్ధాంతము. అందు 1. అనుకరణవాహిక - శైలి, పద్యము లేక పాట, 2 అనుకరణపు తీరు - దృశ్యము, 3 అనుకార్యములు - వస్తువు, పాత్ర, భావము. ఇఁక రెండవది స్థలకాల నాట్యచర్యైక్యములను (Unities of Place, time and action) గూర్చినది. ఈ యైక్యత్రయ సిద్ధాంతము రంగస్థలావకాశములను బురస్కరించుకొని బయలు దేఱినట్టిది మాత్రమే. ప్రాచీన గ్రీకు నాటక రంగస్థలములోఁ దెరల యుపయోగముండెడిది కాదు. అందుచేత కథా ప్రవర్తనలో రంగాంతరసూచన కవకాశముండెడిది కాదు. అందుచేత స్థలైక్యనిర్దేశ మవసరమైనది. ఇఁక చర్యైక్య మన్నది యేకళాసృష్టిలోనైనను సహజముగా పాటింపఁబడెడి నియమము వంటిది. ఈ యైక్యత్రయ సిద్ధాంతముయొక్క సమన్వయమును ప్రాచీన గ్రీకు నాటకములకు మాత్రమే పరిమితముగ గ్రహింపవలయును. అయితే గ్రీకు నాటకముల ననుకరించిన యితర పాశ్చాత్య దేశములవారికిఁ గూడ అరిస్టాటిలు సిద్ధాంతములు తప్పనిసరిగా శిరోధార్యములైనవి. వివిధ పాశ్చాత్యదేశముల నాటక సంప్రదాయ ప్రతిపత్తికి జీవగఱ్ఱ యయినది గ్రీకు నాటకమే.

**౨. రోమను నాటక కళ :—**

రోమనులు మొదట ఎట్రూస్కను జాతినటులనుండి నాట్యకళను గ్రహించినారట. క్రీ. పూ. 364 లో రోమను

దేశములో ననఁగా ఇటలీలో ప్లేగు జాడ్యము వ్యాపించి యుండెడిదఁట. అది రూపుమాసిపోవుటకు దైవానుగ్రహము పొందుటకు ఎట్రూస్కాను నటులు రోమున కాహ్వానింపఁ బడినారట. ఈ సన్ని వేశములో మతసంబంధమైన విశ్వాస మొకటి ప్రతీయమానమగుచున్నది. ఇటువంటి విశ్వాసమే యొకటి మనదేశములో నొకచోట నొకప్పు డుండెడిదని తెలియుచున్నది. తమిళ పంచమహాకావ్యములలో నొక టయిన శిలప్పదిగారములోఁ బ్రసక్తములైన 'అచ్చియర్ కురవై, కునృక్కురవై' అను రెండు నృత్యప్రబంధములు పశుజాడ్యాది దుర్నిమిత్త భయావహములని యందులోఁ జెప్పఁబడినది. ఇటువంటి విశేషములనుబట్టి పరిశీలించి చూచినఁ బ్రపంచములోఁ జాలచోట్ల నాట్యకళోత్పత్తికి మతాశయ ప్రతిపత్తి బీజభూతమయినదిగాఁ దోచుచున్నది. రోమను నాటకకళావిర్భూతికూడ నావిధముగనే జరిగినది. గ్రీసు దేశము రోము కతిసన్నిహితమైనది కాబట్టి రెండు దేశము లకు సాంస్కృతిక సంబంధము లేర్పడుట సహజము. క్రీ పూ. 240 లో నప్పటికే పరిణతావస్థలోనున్న గ్రీకునాటక ప్రభా వము రోములోఁ బ్రస్ఫుటముగాఁ గనిపించినది. ఆరోజులలో 'లివియస్ ఆండ్రొనికస్' అను నొక రోమను బడిపంతులు గ్రీకు ట్రాజెడీ కామెడీల కనువాదములు చేసెను. తదుపరి 'నేవియస్, ఎన్నియస్, పెకూవియస్' అనువారు గ్రీకు నాటకము లాధారముగా మఱికొన్ని నాటకములు వ్రాసిరి. ఆ రెండవతరపు రోమను నాటక కర్తలలోఁ బ్రముఖముగఁ జెప్పఁదగినవాఁడు 'ప్లాటస్' (క్రీ. పూ. 3 వ శతాబ్ది

2 శతాబ్ది నడుమ) అతనికి కామెడీలనినఁ బ్రీతి. అతఁడు మినాండరు ఫైలెమన్ మొదలైన గ్రీకు నాటకకర్తల రెండవ తరపు కామెడీల నాధారముగా నెన్నో కామెడీలు రచించి నాఁడు. అయినను దన స్వతంత్రను గోలుపుచ్చలేదు. తన రచనలలో రోమను ఐతిహ్యములు, నాచారవ్యవహారములను గుఱించిన సంగతులు చొప్పించినాఁడు. సంవాద ఛందోరీతుల గుఱించి యదివఱకున్న సమయముల నతిక్రమించినాఁడు. అతనికి హాస్యమనఁగా నతివేలమైనప్రీతి హాస్యచతురాస్యుఁ డతఁడు. అయితే నాహాస్యావ్యామోహములో సంప్రదాయ శుద్ధమైన కళాత్మక సంయమనము లోపించిన దతని రచన లలో. కాని వానిలోఁ జెప్పుకొనఁదగిన గుణము లనేకమున్నవి. అతఁడు లాటిను భాషానిష్ణాతుఁడు. పదజాలముతో నింద్ర జాలము చేసినాఁడు. కాని యౌచిత్యమున కతిచారముకూడఁ గల్పించినాఁడు. అతని రచనారీతి యద్భుతమైనది. చతురముగా సంవాదములు నడపించుటలో రోమను కామెడీ కర్త లలో నతనిసాటి యెవరునులేరు. అతని కృతులలో బేర్కొనఁ దగినవి 'స్టిచస్', 'స్యుడోలస్' అనునవి. ప్లాటస్కు నించుక తరువాతివాఁడు క్రీ పూ. 168 లో నుండిన స్టేషియస్ కేసిలియస్. రోమను కామెడీ కర్తలలో నతఁడగ్రగణ్యుడని కొందఱి విశ్వాసము. అతనికి వస్తుదక్షత యెక్కువ. కాని యతఁడు రచించిన నలువదిరెండునాటకములలోఁ బదునాఱితి వృత్తములు, మీనాండరు గ్రీకు నాటకేతివృత్తములకు మానస పుత్రికలే. క్రీ పూ. 166 ప్రాంతములో 'టెరన్సు' అను భానిస యాఱు నాటకములను వ్రాసెను. పదజాలమువ్రీఁద

ప్లాటస్‌కున్నంత ప్రభుత్వము లేకపోయినను టెరెన్సు నాటకీయ నిర్మాణమార్మికతలోను, పాత్రచిత్రణములోను, శైలిలోను 'ప్లాటస్' నతిశయించినాఁడు. చవకబారు హాస్యమును నిరసించినాఁడు. భాషాఛందస్సులలో నిరాడంబరతఁ బ్రదర్శించినాఁడు. అతని ప్రాస్తావిక గీతభావములు ప్రజాభిరుచికిఁ గొంత విరుద్ధముగా నుండునవి కాని యతడు వాడిన లాటినుభాష నుడికారము చక్కని సంస్కారమున కాదర్శముగా నుండెడిది.

టెరెన్సు తరువాత రోమను కామెడీల విషయములో గ్రీకు మాతృకల యనుకరణ క్రమముగా సన్నగిల్లి పోయినది. 'ఫాబ్యులాటొగాటా' అను రోమను జాతీయజీవన ప్రతిబింబన ప్రధానమైన ప్రహసనప్రాయమైన రూపకప్రక్రియకు ప్రచారము హెచ్చినది. ఆనాఁడు రోములో రూపకప్రదర్శనములకుఁ జాలగడ్డు నియమము లుండెడివి. అవి గొప్పగొప్ప పండుగలు, పచ్చాలు, జాతరలు, సంబరాలు లేక జాతీయ వీరుల దినవారములు, విజయోత్సవములు, దేవాయతనపర్వదినములు మొదలైన సందర్భములలోనే జరుగవలెను. ఇఁక రంగస్థలనిర్మాణ మప్పటికప్పుడు తాటాతూటముగా జరిగెడిది. చాలకాలమువఱకు నన, గా సుమారు క్రీ॥పూ॥ 55 లో పాంపే శిలామయ నాటకాగార నిర్మాణము జరుగు దనుక సామాజికులకుఁ గూర్చొనెడి యేర్పాట్లుకూడ నుండెడివి కావఁట. రంగాంతరసూచనలు సాంప్రదాయికముగా నేదో మొక్కుబడికివలె ముచ్చుమ్రొమ్మాృలు మాత్రము చేయఁబడుచుండెడివఁట. ఆవిధముననే యానాఁటి ప్రహసనము

లలోఁ గొన్ని సాంప్రదాయిక పాత్రలు కూడ ముఖ్యముగ హాస్యప్రదర్శనకొఱకుఁ బ్రవేశపెట్టఁబడు చుండెడివఁట. పిల్లనగ్రోవి యొక్కటే యానాఁటి నాటకములలోని సంగీత పరికరమట. మొదటఁ గొన్నినాళ్లు నాటకకర్తలే ప్రదర్శనములలోఁ బాల్గొనుచుండెడివారఁట. తరువాత తరువాత నెవఁడోయొక కంట్రాక్టరువలె బయలుదేఱి కిరాయినటుల మేళము నొకదానినిఁ దయారుచేసి యా నాటకప్రదర్శనల కవకాశము కలిగించిన యా యుత్సవముల పెత్తనదారునకు వాళ్ళను నెట్టికిఁ గుదిర్చి యతని యనుగ్రహము సంపాదించి నాటకము లాడించుచుండెడివాఁడు. ఆ కిరాయి నటులు సర్వసాధారణముగా బానిసలై యుండెడివారు. 'అపెల్లను' ప్రహసనములు అనువానిలో మాత్రము స్వతంత్రులైన పౌరులుకూడ పాల్గొనెడివారు. కాని రోమనుసామ్రాజ్య మంతరించుటతో నక్కడ యథార్థమైన నాట్యకళ యంత రించి రంగస్థలము సామాన్యనర్తకుల కైవసమయిపోయినది.

3 భారతదేశము – సంస్కృతరూపకకళ :—

క్రీ॥ పూ॥ 4 వ శతాబ్ది యుత్తరార్థములో జరిగిన అలెగ్జాండరు దండయాత్రల ఫలితముగ గ్రీకు భారతదేశము లకుఁ బరస్పరము సాంస్కృతిక సంబంధము లేర్పడినవను సాకుఁజూపి కొందఱు పండితులు గ్రీకులనుండి భారతీయులు నాటకకళను గ్రహించినారను వాదమొకటి లేవఁదీసినారు. కాని భారతీయ రూపకకళ యతిప్రాచీనమైనది. దాని ప్రయోజనాదర్శనములే వేఱు. ప్రక్రియయే వేఱు. మన పురాతత్వశాస్త్రపరిశోధకులకు ఛోటా నాగపూరులో, రామఘుర్

గిరిగహ్వారములలో, సింధులోయలోని హారప్పా, మొహెం జొదారోల కడ లభించిన యాధారములను బట్టి క్రీ॥ పూ॥ 2-3 శతాబ్దులకే విశిష్టములైన నాటకశాలలు మనదేశములో వెలసినట్లు తెలియుచున్నది. వాల్మీకి రామాయణములో వధూనాటక సంఘప్రసక్తి పతంజలి మహాభాష్యములో కంసవధము, బలిబంధనమను నాటకముల ప్రసక్తి పాణినీయములో రూపకోపస్థితినిఁ గూర్చి కొన్ని సూచనలు (శైవాలి కృశాశ్వులకు సంబంధించిన నటసూత్రములు) కనఁబడుచున్నవి. అసలతిసనాతనములయిన మనవేదములలోనే యుదాహరణకు ఋగ్వేదములోని యమ యమీ యూర్వశీ పురూరవుల సంవాద సందర్భములలో భారతీయ నాటకకళా బీజములు నిక్షిప్తములై యున్నవని పాశ్చాత్యపండితులే కొంద అంగీకరించినారు. (కీత్ మొ॥ వారు) నాటకమునకు జీవనాడి సంవాదముకదా! ఈ యాధారముల కాలపరిమాణము క్రీస్తు పూర్వము కొన్ని శతాబ్దములు సహస్రాబ్దములు వెన్కకుఁ బోవును. క్రీ॥ పూ॥ 2 వ శతాబ్ది ప్రాంతములో భారతీయ నాటకకళకుఁ బరమ ప్రమాణగ్రంథమైన భరతనాట్యశాస్త్రము వెలసినది. అందులోని విషయములను బట్టి చూచిన నప్పటికే భారతీయ రూపకకళ యెంతచక్కని పరిణతిఁ బొందినదో విస్పష్టమగును. భరతాచార్యునకుఁ బూర్వమే మనకుఁ గొన్ని నాట్యశాస్త్రగ్రంథము లుండెడివని భరతగ్రంథమువలననే తెలియుచున్నది. ఆరీతి నన్ని నాట్యశాస్త్రగ్రంథములు వెలసినవనఁగా నంతకుముందెంత లక్ష్యకోశముండి యుండ[illegible]లెనో యూహింపవచ్చును. అట్టిచో

గ్రీకులనుండి భారతీయులు నాటకకళ నభ్యసించిరనుట హాస్యాస్పదమే యగును

గ్రీకు నాటకోత్పత్తి కేవలము మతాశయప్రతిపత్తి మూలముగా జరిగినది. "విశ్రాంతి జననం కాలే నాట్యమేతన్మయాకృత"మ్మని మన భరతోక్తి అనఁగా మన రూపకలక్ష్య మెక్కువగా 'రిక్రియేషన్' అనఁగా సుఖసంకథావినోదకాలక్షేప మన్నమాట అటులని మన నాటకేతివృత్తము లల్లిబిల్లి కథలుగావు. అవి మహోదాత్తములు. రామాయణభారతాది మహేతిహాసములనుండి గృహీతములు. ధర్మపథనిర్దేశముతోఁ బాటు కళాధర్మసౌభాగ్యము సూచముట్టుగ సాధించునట్టివి మన నాటకములు. శిల్పదృష్టితోఁ జూచిన సాహిత్యములో శిఖరతుల్యమైన ప్రక్రియగా భారతీయులచేతఁ బరిగణింపఁబడుచున్నది రూపకము. సంప్రదాయ సిద్ధముగ నీనాటికిని భారతీయులు తమ నాటకసామాజికులను 'ప్రేక్షకులు' అనఁగా జూచెడివారని యనుట పరిపాటి. గ్రీకులు, తత్ప్రాపి పాశ్చాత్యులందఱు 'ఆడియన్సు' అనఁగా శ్రోతలని (వినెడివారు) యందురు. నాటకములోఁ బ్రేక్షణీయము నాట్యము. శ్రోతవ్యము సంగీతము. అనాదిగా మన నాటకములు నాట్యప్రధానములు. ప్రాచీన గ్రీకు నాటకములలో 'కోరస్' అనఁగా బృందగాన మదొక 'విధాయకము'గాఁ బ్రాధాన్యము వహించినది. అనఁగా నవి సంగీతప్రధానములు. అందుచేత నాయా నాటక ప్రధాన తత్వములకనుగుణముగనే తత్తత్సామాజికుల కాయా భిన్నభిన్న వ్యవహారములు కలిగినవి. అరిస్టాటిలు చెప్పిన లక్షణము చూచిన

నసలు లక్ష్యలోకమునే పరిశీలించినను గ్రీకు నాటకకళ యనుకరణైక్యత్రయ సిద్ధాంతత్వ ప్రకృష్టమైనదని తెలుసు. భరతనాట్యశాస్త్రము చూచినను, భాసకాళిదాసాదుల రచనలు చూచినను భారతీయ నాటకకళ రసరాద్ధాంత పరాయణమైనదనియు, సంధిసంధ్యంగ ప్రక్రియావిశిష్టమైనదనియు తెలుసు. దానికి గ్రీకుల యైక్యత్రయ సిద్ధాంతము పట్టదు. గ్రీకునాటకములు విషాదాంతములు, మోదాంతములు నని రెండు తెగలు మనరూపక ప్రభేదము ప్రధానముగా దశవిధములు. తత్రాపి అష్టాదశాధికముగా నుపరూపక ప్రక్రియలు కూడ వెలసినవి. అందులోను గ్రీకుల కత్యంత ముపాదేయములైన విషాదాంతములు మన ప్రాచీన నాటక వాఙ్మయములో మచ్చునకుఁగూడ కానరావు.

'నాఽశ్లీలం కీర్తయేత్' 'నాఽధికారి వధం కదాపి సూచయేత్' అను శాంతితత్వ ప్రవణమైన భారతజాతి సంస్కృతికి విషాదాంతములు సొక్కవు కావ్యవిషయములలో 'మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని' అని భారతీయాదర్శము. పతంజలి మహాభాష్యములోఁ బేర్కొనఁబడిన కంసవధము, బలిబంధము, భాసుని యూరుభంగము మొదలగునవి విషాదాంతము లందురు కొందఱు. కాని నాటకాంతములో సామాజిక నిష్ఠముగా విషాదము మిగిలిననే యది విషాదాంతమగును. రసము సామాజిక నిష్ఠమని భారతీయాలంకారిక మతము. అది యనుభవసూన్నృతమైన సూత్రము. ఈ దృష్టితోఁ జూచినఁ గంసవధాదులు వధ ప్రసక్తమైనంత మాత్రమున విషాదాంతములు కాలేవు అక్కడ నాయకునితో

సామాజికునకు సానుభూతిలేదు. గ్రీకు కామెడీలలోని ఫాల్లస్, పారబాసిస్ మొదలైన విషయములకు భారతీయ రూపకములలోఁ బ్రసక్తిలేదు. అందులో సిందులో సాంప్రదాయిక పాత్రలకుఁ బ్రసక్తి యున్నదికాని యామన విదూషకాది పాత్రలకు గ్రీకుల ఆరకిల్సు మొదలగు పాత్రల కెక్కుడను బోలికలేదు అటులనే గ్రీకు నాటకముల 'ప్రోలాగ్స్' కును భారతీయ రూపకముల పూర్వరంగవిధులు, నాందీ ప్రస్తావనలకుఁ బోలిక తక్కువ ఉత్తర రంగములోఁ గూడ మన యంకలక్షణము, నర్థప్రకృతి పంచకము, కార్యావస్థా పంచకము, వాని సంయోగమువలన నేర్పడు పంచసంధులు, నర్థోపక్షేపములు, పాత్రలు, వానిసంభాషణలు మొదలగు ననేక విషయములకు సంబంధించిన విధినిషేధములు, సమయ సంప్రదాయములు చూచిన మన నాటకము 'అవస్థానుకృతిర్నాట్యమ్' 'రూపారోపాద్రూపకం' అను సామాన్య సూత్రములు వర్తించు సామాన్యప్రక్రియ యని కాక యెంత నిబిడబంధముఁ గలదో తేటతెల్లమగును. గ్రీకు రూపక ప్రక్రియ కింతతంతులేదు. అటులనే రంగస్థల విషయము చూచుకొనినను బ్రాచీన గ్రీకు నాటకములు రాచప్రాపుఁ ఏథెన్సు నగరములోఁ దప్ప సాధారణముగా పల్లెటూళ్ళ యారుబయలులలో నాడఁబడుచుండెడివి. భారతీయ నాటక రంగ మాకార పరిమాణరంగ ప్రసాధనాది సర్వవిషయములలో నతి విశిష్టమైనది. అందుకు భరతనాట్య శాస్త్రమే ప్రమాణము వెనుకటితరపు పాశ్చాత్యపండితులు కొందఱు సంస్కృత నాటకములలోఁ దెర యవనికశబ్ద వ్యవహృతమై

యుండుటఁ జూచి యది యవనులు - అనఁగా గ్రీకులనుండి భారతీయులచే గ్రహింపఁబడిదనియు నందుచేత నాటకకళ యటులనే గ్రహింపఁబడి యుండుననియు ననియున్నారు. కాని యది వ్యర్థవాదము, వట్టిప్రవాదము. యవనులనఁగా గ్రీకులే యనుచూప యథార్థమైన నాఁడుకూడ పైవాదముమాత్రము యథార్థముకాదు. ఎందుచేత ననఁగా చాలకాలము వఱకు గ్రీకు నాటకములలోఁ దెర వాడకమే యుండెడిది కాదని యిటీవల పరిశోధనలవలనఁ దెలిసినది. అయితే గ్రీకు భారతీయ నాటకములకుఁ గొద్ది సాదృశ్యము మాత్రము లేక పోలేదు. ఉదాత్తవస్తుమయత్వము ప్రాసంగికేతి వృత్తస్వీకరణ నిబిడమైనయవయవాయువవి సంవిధానము, గద్యపద్య సమ్మిశ్రణము మొదలగు విషయములలోఁ గొంత సాదృశ్య మున్నది. కాని సంబంధ మొంతమాత్రమును లేదు. ఆ రెండును బరస్పర నిరపేక్షకముగా బయలుదేఱినవి, యభివృద్ధిఁ బొందినవి.

ఆకీతి సర్వతంత్ర స్వతంత్రముగాఁ బ్రారంభదశలోనే మహోజ్జ్వలముగాఁ బ్రాదుర్భవించిన భారతీయనాటక వాఙ్మయ చరిత్రలో నీనాఁడు మనకుఁ దెలిసినంతలో మొట్టమొదటి నాటకకర్త భాసమహాకవి. భారతీయ రూపక స్వరూపమును బహులక్ష్యములతో మహోదాత్తముగా నిరూపించిన భాస మహాకవి భరతాచార్యునకే పూర్వుఁడని చాలమంది పండితులు పరిగణించుచున్నారు. అతఁడు భారతీయ మహేతిహాసములైన రామాయణ మహాభారతములనుండి రసవంతములైన గాథలను గ్రహించి చక్కని శిల్పముతోఁ జక్కని

సన్నివేశములతో ననేక నాటకములు రచించినాఁడు. అవియు నతనివే యయిన స్వప్నవాసవదత్తము, చారుదత్తము, ప్రతిజ్ఞాయౌగంధరాయణములు కలిసి మొత్తము పదుమూఁడు (పదునాలుగు యజ్ఞఫలముతో) భాసనాటకచక్రమని ప్రసిద్ధి వహించినవి భాసనాటకములలోని ముఖ్యమైన గొప్పగుణమేమిటనఁగా నతఁడు స్వయముగా నా నాటకముల కొక దర్శక నిర్మాత వంటి వాఁడగుటచేత నవియన్నియు చక్కని ప్రదర్శనాసౌలభ్యమును, శిల్పమును గలిగియున్నవి. అర్వాచీన సంస్కృత కవులెందఱో యతనిని స్తుతించినారు. కాళిదాసువంటి గొప్ప నాటకకర్త యతని నెంతయో ప్రశంసించినాఁడు

అతని తరువాత మనకుఁ దెలియవచ్చిన నాటకకర్త అశ్వఘోషుఁడు. అతఁడు గుప్తయుగములో క్రీ॥ శ॥ 150 ప్రాంతములో నుండెడివాఁడు. అతనికృతి శారీపుత్ర ప్రకరణము. (ప్రకరణమనునది దశరూపకములలో నొకటి). సంస్కృత వాఙ్మయ తారాపథములో ధ్రువతార మహాకవి కాళిదాసు (క్రీ॥శ॥ 4 వ శ॥). అతఁడు రచించినవి మూఁడు నాటకములే యయినను ఆ కాళిదాసత్రయమనిన భారత దేశమంతయు కళ్ళకద్దుకొనును. ఎందఱో మహాపండితులు వానికి వ్యాఖ్యానములు రచించినారు. అవి యెన్నో భాషలలోని కనూదితములయినవి. అందులో నభిజ్ఞానశాకుంతలము 'కావ్యేషు నాటకం రమ్యమ్' అను నా భాణకము నక్షరముల సార్థకము చేసినట్టిది. ఇది 18 వ శతాబ్దిలోనే సర్ విలియమ్ జోన్సు మహాశయునిచే నాంగ్లములోని కనూది

తమై, వివిధ దేశములలోఁ బ్రదర్శనభాగ్యము కూడఁ బొంది పాశ్చాత్య ప్రపంచమును బ్రమోదపాథోధి నుఱ్ఱూతలూగించినది. మాక్సిముల్లర్, గెటే మొదలగు సుప్రసిద్ధ పాశ్చాత్య పండితు లా నాటక రాజమును జూచి యెంతో మురిసిపోయినారు, మెచ్చుకొనినారు అతని కడను రెండు నాటకాలు విక్రమోర్వశీయము, మాళవికాగ్నిమిత్రము. అతని శాకుంతలము విక్రమోర్వశీయము ప్రసిద్ధేతివృత్తములు కాని యతఁడు తీర్చిన తీర్పు వేఱు. మాళవికాగ్నిమిత్రము ప్రసిద్ధేతివృత్తము కాకపోయినను సంస్కృతములో దానికి మానసపుత్రికలుగాఁ జాల నాటకాలు వెలసినవి. అతని నాటకములన్నియు నుదాత్తవస్తుమయములు. ఉజ్జ్వలరసస్ఫూర్తిఁగలవి. ఉపమాది మనోహరాలంకార ప్రకృష్టములు. ప్రదర్శనల కెక్కరాణించినవియును. అతని నాటకములలోఁ గవితాచమత్కృతి నాటకీయత నతిశయించును.

మఱొక నాటకకర్త శూద్రకుఁడను మహారాజుకూడ సంస్కృతనాటక వాఙ్మయ చరిత్రలోఁ బ్రాచీన యుగమునకుఁ జెందినవాఁడని చెప్పుదురు. అతఁడు మృచ్ఛకటికమను ప్రకరణమును, పద్మప్రాభృతకమను భాణమును రచించినాఁడు. అందులో మృచ్ఛకటిక శాకుంతలమువలెనే యాంగ్లములోనికి ననూదితమై పాశ్చాత్యుల మన్ననల నందుకొనినది. అందులోఁ బాత్రచిత్రణలో మంచి ప్రత్యేకతను బ్రదర్శించినాఁడు కవి. ఇందలి నాయికానాయకులు వసంతసేన యను వేశ్య, చారుదత్తుఁడను బ్రాహ్మణుఁడు. వీరి పాత్రలు చాల యుదాత్తముగాఁ జిత్రింపఁబడినవి. శకారుఁడను హాస్య

పాత్రి జీవకళ యుట్టిపడుచుండును. మృచ్ఛకటికను జదివినవా రుదాత్తుఁడైన చారుదత్తునైనను మఱచిపోఁగలరు కాని శకా రుని మఱువలేరు. వసంతసేన వేశ్య యయిననామె హృదయ మొక పవిత్రిప్రణయ మధుపాత్రి. నాటకమైపోయినను సామాజికునకా మధురహృదయ స్పందనము వినిపించుచునే యుండును. నాటకము సమకాలిక జీవిత ప్రితిబింబనముతోఁ జక్కని వాస్తవికతా స్ఫూర్తితో సాగినది. సంస్కృతనాట కములలో నిటువంటి నాటకము మిక్కిలి యరుదు.

సంస్కృతి నాటకచరిత్రలో రచనకు సంబంధించినంత వఱకు 'క్లాసికల్ ఏజ్' అనిపించుకొనునది క్రీ॥ శ॥ 10–11 శతాబ్దులదాఁక సాగినది. భాసకాళిదాసాదుల తరువాత క్రీ॥ శ॥ 6–11 శతాబ్దుల నడుమ చెప్పఁకొనఁదగిన సంస్కృత నాటకకర్తలు భవభూతి (కృతులు: ఉత్తరరామచరిత్రము, మహావీరచరిత్రము, మాలతీమాధవము) శ్రీహర్షుఁడు (నాగా నందము, రత్నావళి, ప్రియదర్శిక), మురారి (అనర్ఘరాఘ వము) దిఙ్నాగుఁడు (కుందమాల), విశాఖదత్తుఁడు (ముద్రా రాక్షసము) రాజశేఖరుఁడు (బాలరామాయణము) దామో దరమిశ్రుఁడు (హనుమన్నాటకము), శక్తిభద్రుఁడు (ఆశ్చర్య చూడామణి), జయదేవుఁడు (ప్రసన్నరాఘవము), భట్టనారా యణుఁడు (వేణీసంహారము), కృష్ణమిశ్రుఁడు (ప్రబోధ చంద్రోదయము) ఇందులో రామాయణేతివృత్తము లెక్కువ. అందులో నుత్తరరామచరితము మిక్కిలి ప్రసిద్ధమైనది. ప్రశస్తరచనగలది. కరుణరసమునకదే రసైకరాజ మన్నంత ప్రశస్తిను సమకూర్చునట్టిది. శ్రీహర్షుని రత్నావళీ ప్రియ

దర్శికలు మాళవికాగ్ని మిత్రమునకు మానసపుత్రికలు. అతని నాగానందము దయావీర రసధర్మ ప్రతిష్ఠాపకము. మురారి యనర్ఘరాఘవ మొక మహానాటకమే కాని యది జటిలపద పటాటోపముతోఁ బఠనపాఠనములలోనే కాని ప్రదర్శనలోఁ బ్రతిష్ఠ సంపాదించుకొనలేక పోయినది. ముద్రారాక్షసము చారిత్రకేతివృత్తము వీరరసప్రధానము, రాజకీయ తంత్రరమణీయము నగు రూపకములకెల్లఁ దలమానికము. రాజశేఖరుని బాలరామాయణ రచనాప్రక్రియ ప్రత్యేకత గర్భాంకము లేక యంతర్నాటకశిల్పము. వేణీసంహారములో 'పతాకాస్థానకము' (Dramatic Irony) అతి నిపుణముగాఁ బ్రదర్శింపఁబడినది. ప్రబోధచంద్రోదయము విషయము తాత్త్వికము. వివేచన సాంకేతికమైన విశిష్టరచన. దీనిలో మానవుని యందుండు గుణములు, ప్రలోభములే పాత్రలు. వానిమధ్య జరుగు సంఘర్షణే నాటకవృత్తము. ఇటువంటి నాటకాలు ప్రదర్శనలలో రాణించుట కష్టము. కృష్ణమిశ్రునితో సంస్కృత నాటక వాఙ్మయచరిత్రలు 'క్లాసికల్ ఏజ్' గతించినదని చెప్పవచ్చు. తరువాత నాలంకారికులు రూపక లక్షణములను గుఱించి చర్చించుట, రాజాస్థానములోఁ బ్రాచీన నాటకాలు ప్రదర్శింపఁబడుట మాత్రము కద్దు.



## 2. మధ్యయుగము

( క్రీ. శ. 6-1౧ శ. లకు నడుమ )

ప్రాచీన యుగమంతయు గ్రీకు రోమను భారతాది మహాజాతులు సామ్రాజ్య భోగముల ననుభవించిన కాలము. అందుచేత నాయా దేశములలోఁ గళలు కూడ నుచ్ఛస్థితిలో నుండెడివి. సర్వజనోప భోగ్యమైన కళాసమాహార స్వరూప మైన రూపకము కూడ నున్నతదశలో నుండెడిది. కాని రానురాను సామ్రాజ్యము లంతరించినవి. ప్రజలలోఁ గళల యెడ భోగదృష్టికన్నను వాస్తవికదృష్టి హెచ్చినది. దానితో పాటు నైతికపతనము, నలసములైన యభిరుచులు కూడ పొడసూపినవి. మధ్యయుగ నాటకములను పరిశీలించిన నీవిష యము విశదమగును.

భారత దేశములో మధ్యయుగములో సంస్కృతములో స్వతంత్రముగా వెలసిన నాటకములు తక్కువ, ప్రాచీన రూపకముల కనుకృతులెక్కువ. ఉదాత్త వస్తుమయములైన మహానాటకములు ప్రాయికముగా మఱి బయల్దేఱనే లేదని చెప్పవచ్చును. అలస విరస శృంగార హాస్యములతో బయల్వెడలిన భాణములు ప్రహసనములే యెక్కువ అయితే ఆ భాణప్రహసనములలో నాగ్రంథకర్తలకుఁ జక్కని వాస్త వికదృష్టియున్నట్లు గోచరించును. వస్తువులు పాత్రలు వారి సంవాదములు సమకాలిక సాంఘిక జీవితములోనుండి సజీవ ముగా లేచి వచ్చినట్లుండును.

ఈ మధ్యయుగములోనే భారతదేశములోని వివిధ రాష్ట్రభాషలు కావ్యోపస్థితి కనుగుణముగాఁ దయారయినవి. కాని యెందును స్వతంత్రముగా నాటకమని చెప్పఁకొనఁ

దగిన రచనకాని సంస్కృత నాటకమువంటి నాటకముగాని సంస్కృతనాటకాను వాదములుకాని బయలుదేఱలేదు. సంస్కృతభాషా సాహిత్యములతో సంపర్కము పెంపొం దించుకొని యీ సాహిత్య సాంప్రదాయమును జీర్ణించుకొని, యీ కావ్యా లనువాదముచేసిన యీనాఁటి దేశభాషాకవులు సంస్కృతనాటకా లనువాదము చేయుటకుఁ బ్రయత్నించిన వారుకూడ ఆ నాటకములను నాటకములుగా మాత్రి మనువ దించక పోవు టాశ్చర్యకరము. శోచనీయము. (ఆధునిక యుగములో సంస్కృతనాటకముల కనువాదములు ననుకర ణలు, పరివర్తనలు సన్నిభాషలలో జరిగినవి) అయితే నానాఁ డా దేశభాషలలోఁ దక్కువ తరగతికిఁ జెందిన యేవో కొన్ని నాటకముల కసలే ప్రుట్టగతులు లేకపోలేదు. వంగదేశపు యాత్రిలు, నాంధ్రి తమిళ కన్నడ దేశముల యక్షగానములు వీధినాటకములు, బయలాటలు బహురూపాలు మొదలైనవా కోవకుఁ జెందినవి. పౌరాణి కేతివృత్తముల ప్రాచుర్యము సమకాలిక విషయస్పర్శ హాస్యశృంగారముల ప్రాముఖ్యము జనవ్యవహారమునకు బోధశాలితకు సన్నిహితముగా నుండు భాష వీని సామాన్య లక్షణములు. జానపదవినోదము వాని ధ్యేయము. ఆనాఁడు ప్రాచ్యపాశ్చాత్య దేశములలో బయలు దేఱిన నాటకములలో నెక్కువ పాలిటువంటివే.

పాశ్చాత్యదేశములలో ముఖ్యముగా యూరపులో క్రీస్తుమతమునకుఁ బ్రచార మతిశయించుచుండినకొలఁది దాని ప్రభావము నాటకకళమీఁదఁ గూడ పడుచు వచ్చినది క్రైస్తవ మతాధిపతులు నాటకకళ మంచి ప్రచారసాధనము

కాఁగలదని గ్రహించినారు. నైతికపతనము పొందుచున్న జాతుల నుద్ధరించుటకని యేమి, స్వీయమతప్రచారము కొఱకని యేమి బైబిలు గాథలాధారముగాఁ బ్రబోధముతోఁ బాటు కొంత వినోదము కూడ మిళాయించి నాటకములు తయారుచేసి చేయించి చెర్చి ఆవరణలలో, పరిసరములలోఁ బ్రదర్శించు చుండెడివారు. అవి మిస్టరీలు, మిరకిల్సు, మొరాలిటీస్ మొదలైన పేరులతో వ్యవహరింపఁ బడుచుండెడివి. ఆనాఁడు యూరపులో నే దేశములోఁ జూచినను వీనికే ప్రాముఖ్యముండెడిది. మధ్యయుగ పాశ్చాత్యనాటకములనఁగాఁ బ్రాచీన నాటకానుకృతులు కొన్నిపోను, ప్రధానముగా మిస్టరీలు మొదలైనవే.

మిస్టరీలలో నాధ్యాత్మిక విషయములకే ప్రాముఖ్యము బైబిలుగాథలకే యెక్కువ ప్రసక్తి. మిరకిల్సులో క్రైస్తవ యతిపుంగవులను గుఱించిన యైతిహ్యములకుఁ బ్రాముఖ్యమెక్కువ. మొరాలిటీలు క్రైస్తవ మతసంబంధములైన నైతిక సత్యములనే యుద్ఘాటించుచు, కాని యందులో విషయావిష్కరణలో నొకరకమైన యన్యాపదేశ సాంకేతికత యుండును. అనఁగా మన ప్రబోధచంద్రోదయాదులలో వలె వివేకుఁడు, మహామోహుఁడు మొదలైన పాత్రలవంటివే వీనిలోని పాత్రలు. ఈ మిస్టరీలు మొదలైనవి మతసంబంధములే యయినను వానిలో ననుచితమైన భాషకు, హాస్యమునకుఁ గూడ నవకాశములు కల్పింపఁబడినవి. అది బహుశా పామరజన రంజకత్వముకూడ సంపాదించుటకొఱకై యుండుననని యూహింపవచ్చును. ఇవి చెర్చి ఆవరణల

లోనే కాక చెర్చి సంబంధులతో సేర్పాటైన దేశదిమ్మరి మేళములచే నూరూర, చెర్చి బయటఁగూడ నాడఁబడు చుండెడివి. అందుచేతఁ దఱచు వానిలో లౌకిక విషయ ప్రసక్తికూడఁ బొడసూపుచుండెడిది. ఇటువంటివానినుండే యాయా దేశములలో జాతీయనాటకకళ క్రమక్రమముగా నవనవోన్మేషము నందుచు వచ్చినది.

## 3. నవీనయుగము
(క్రీ॥ శ॥ 16 శ నుండి 20 శ॥ వఱకు)

నవీన యుగములో వివిధదేశములలో నాయా దేశములకు సహజమైన జాతీయ నాటకకళ క్రమక్రమ వికాసము పొందుచు వచ్చినది. భారతదేశములో వివిధభాషలకు సాహిత్యయోగ్యత పట్టి చాల కాలమైనను 19 వ శతాబ్ది దాఁక నా భాషలలో సరిగా నాగరికమైన నాటకమని చెప్పఁ దగిన రచనలు ప్రాయికముగా లేనేలేవని చెప్ప వచ్చును. ఆంగ్ల సంస్కృతి సాహిత్యముల ప్రభావము ముమ్మరముగా సోకిన 19 వ శతాబ్దినుండి నాటకరచన ప్రదర్శన ప్రారంభమైనవి. మొదటిలో నాంగ్లసంస్కృత నాటకముల కనువాదములు మాత్రమే వెలసినవి. క్రమముగా నితర పాశ్చాత్య భాషానాటకములకుఁ గూడ ననుకరణలు పరివర్తనలు వెలసినవి, వెలయుచున్నవి. ఇటీవల స్వతంత్ర నాటకములు నాటికలు కూడ జాతీయ చారిత్రిక సాంఘికేతివృత్తములతో వెలయుచున్నవి. అయితే రచనా ప్రక్రియలో మాత్రము పాశ్చాత్యనాటిక ప్రక్రియనే యెక్కువ యాదరించుచున్నారీ నాటకకర్తలు, జపాను (కబూకీ-నో), జావా

(వాయంగ్‌వోంగ్), బర్మా (నిభట్‌కిణ, యాగణహాసా), సింహళము (కోలమ్‌సాటిమా) మొదలైన ప్రాచ్యదేశముల లోను దత్తజ్జాతీయమైన నాటకకళ 16, 17 శతాబ్దులనుండి యభివృద్ధి పొందుచు వచ్చినది. అవి ప్రాయికముగా భారత దేశములో మధ్యయుగములో బయలుదేఱి మొన్నమొన్నటి దాఁక ప్రవర్తిత మగుచుండిన యాత్రలు యక్షగానములు వీధినాటకములవలె నుండును.

(ఇప్పు డిక్కడ కొన్ని ముఖ్యమైన పాశ్చాత్యదేశముల జాతీయ నాటకకళ గురించిన విషయము మాత్రమే సంగ్రహముగాఁ బ్రసక్తమగుచున్నది).

ఇటలీ:—

ఇటలీలో క్రీ॥శ॥ 15వ శతాబ్దిదాఁక మిస్టరీలు, గేయ నాటికలు, యాసబాసల వినోదనాటికలు మొదలైనవి యెక్కువగాఁ బ్రదర్శింపఁబడు చుండెడివి. ప్లాటస్, టెరెన్సుల నాటకముల కనువాదములు, ననుకరణములు జరుగుచుండెడివి. అప్పుడప్పుడే యూనివర్సిటీ విద్వాంసులు, విద్యార్థులుకొందఱు స్వతంత్ర నాటకరచనకుఁ బూనుకొనినను వారి రచనల కొక తీరు తెన్ను నుండెడివి కావు. ప్రాచీనపు కామెడీ ప్రక్రియ కొంత మిస్టరీల ప్రక్రియ కొంతగా కలగాపులగముగా నుండెడివి. పెట్రార్చియొక్క ఫిలోలోగియా, లియొనార్డో బ్రూని యొక్క పోలిసీనా మొదలైనవా తరగతికిఁ జెందినవి. ఇవన్నియు కామెడీలే. అసలు ఇటలీలో ట్రాజెడీ కాదినుండి యొక సాహిత్య ప్రక్రియా ప్రతిపత్తి మాత్రమే యుండెడిది. తదుపరి 16వ శతాబ్దిలోను 17వ శతాబ్ది దాఁక స్పెయిను

దేశపు రొమాంటిక్ సేక్రెడ్ ట్రాజెడీల ప్రభావము ఫ్రెంచి నియోక్లాసికల్ రూపకములకు గ్రుడ్డి యనువాదములు ననుకృతులు సాగినవి. కాని 17వ శ॥లో ప్రాచీన నాటక సూత్రముల కుదార నిర్వచనములతో నాటక లక్షణ విమర్శ బయలు దేఱినది. ఆనాడే షేక్స్పియరు నాటకముల ప్రభావము పొడసూపి ఏ. కాంటి మొదలగువారి ట్రాజెడీలు క్రొత్త త్రోవ ద్రొక్కినవి. ప్రసిద్ధ ఫ్రెంచి విప్లవకారుఁడు, రచయితయయిన వోల్టెయిర్ (1694–1778) ప్రభావముపడి రోమను ట్రాజెడీ కర్తలలో నగ్రగణ్యుఁడైన కౌంట్ వి. ఆల్ఫియరి (1749–1803), ఫాస్కొలో, మంజోనీ, పెల్లికో, నిక్కొలిని, గయాకొమెట్టి మొదలైనవారి నాటకములలో రాజకీయ విమర్శ, దేశభక్తి ప్రబోధము తావుఁగల్పించుకొనినవి. 18శ॥ చివర యూరపు ఖండమంతటను 'రొమాంటిక్' ఉద్యమము బయలు దేఱినది. సంప్రదాయ నిరసనము, జీవితములో, సాహిత్యములో నూత్న మార్గాన్వేషణయుఁ బ్రారంభమైనది. మంజోని 1820 ప్రాంతములో వ్రాసిన కార్మాగ్నోలా, ఎడెల్చి అను ట్రాజెడీలలో నైక్యత్రయసిద్ధాంతము పాటింపఁబడలేదు. అవి సుప్రసిద్ధ జర్మను పండితుఁడు గెటీ ప్రశంసలందుకొన్నవి. ఆనాఁటి నాటకములలో లాటిను భాషకుఁ బ్రతిపత్తి సన్నగిల్లినది. వివిధ మాండలిక భాషలకు స్థానము సమృద్ధిగా దొరకినది. ఉదాహరణకు గోల్డోనీ ప్రభృతుల కృతులు. నాఁడుచారిత్రక మోదాంతములు కూడ విరచింపఁబడినవి. కాని సామాజిక దృక్పథముతో వ్రాయఁబడిన వానికిఁ బలుకుబడి హెచ్చినది. సమకాలిక సాంఘికేతి వృత్తము

లతో నాటక రచనఁ బ్రారంభించినవాఁడు ఫెరారి (1822-89). వానితో మానవ మనస్తత్వమునకు సంబంధించిన సమస్యలను జోడించి నాటకములు వ్రాసినవారు వెర్గా (1849-1928), బుట్టి (1865-1911), బ్రాకో మొదలగువారు 20శ॥ ప్రథమపాదములో నిశిత మనస్తత్త్వైక దృష్టితో వాస్తవికతను బరిశీలించు విశిష్ట నాటక రచనలు చాల బయలుదేఱినవి. అందులో విశిష్టాతి విశిష్టములైనవి లూగీ పిరాండెల్లో రచనలు. అతఁడు వాస్తవికతనే సవాలు చేసినాఁడు. వాస్తవికత యొక్క వైవిధ్యమును, మానవుని బహిరంతర ప్రవృత్తులలోని మర్మమును లోకోత్తరమైన విదగ్ధతతో నిరూపించెను. అతఁడనేక రూపకములు రచించినాఁడు. ప్రదర్శింపఁ జేసినాఁడు. 1934 లో సాహిత్యమునకు "నోబెలు" బహుమానము పొందిన ఘనుఁడతఁడు. అతని నాటక కృతులన్నిటిలో నతి విశిష్టమైనది, ప్రసిద్ధమైనది "సెయ్ పెర్సొ సాగ్గి ఇన్ సెర్కాది ఆతోర్"*. అనఁగా గ్రంథకర్త నన్వేషించుచు వచ్చిన యారు పాత్రలని యర్థము. రచయిత భావనా ప్రపంచములో నావిర్భవించిన పాత్రల ప్రవృత్తి యిందులోని యితివృత్తము. అందులోఁగొన్ని పరిపూర్ణ వ్యక్తిత్వమును గలవి. కొన్ని యపరిపూర్ణములు. ఆ పాత్రలు గ్రంథకర్తృగవేషణలో తమ గమ్యము పొందుటకుఁ జేయు ప్రయత్నములో నొక నాటక దర్శకునితో నయిన సమావేశము యిందులోని సన్నివేశము. అంతయు నొక చిత్రాతి చిత్రమైన సంఘటన, ఊహకు, వాస్తవికతకు నడుమ చక్కని సంఘర్షణ. అతిసిప్ర

*'Six Characters in Search of an author'.

ణముగా నిర్వహించినాఁడీసన్ని వేశమును పిరాండెల్లో. అయితే నతని నాటక రచనలన్నియు సరియైన పరిష్కార మార్గము లను సూచించవు. కొన్ని ప్రశ్నార్థకములుగా మిగులును. మెదడునకు మేఁత గల్పించును. ప్రపంచ నాటక చరిత్రలో పిరాండెల్లోవొక యతి విశిష్టమైన నూత్నపంథ. చ్యారెల్లి, ఆంటొనెల్లి, మార్టిని మొదలైన ఇటాలియను నాటక కర్త లతని మార్గమును కొనసాగించుచు వచ్చినారు.

స్పెయిను:—

నవయుగములో ఇంగ్లండువలె నచిరకాలములోనే స్వతంత్రముగా నొక జాతీయమైన రూపకకళను రూపొందించుకొనిన గౌరవము యూరపుదేశములలో నొక్క స్పెయినుకే దక్కను.

15 వ శతాబ్ది చివరనుండిన జె. డి. వా, ఎంసైనా స్పెయినుదేశ నాటక పితామహుఁడుగాఁ బరిగణింపఁబడుచున్నవాఁడు. అతఁడు మతాశయములలో గ్రామీణ ప్రకృతి చిత్రణతో రచించిన గోపికాగీతములవంటి సంవాదాత్మక గేయకృతులలో నాటకకళాబీజములు సమృద్ధిగానున్నవి. తన పరి లోప్-డి-ర్యూడా' అనునతఁడు నటులు, నాటకగ్రంథ కర్తలు, గ్రంథవిక్రేతలు నయిన కొంతమందిని ప్రోగుచేసి యొక 'దేశద్రిమ్మరి' మేళముగా తయారుచేసి నాటకకళను చెర్చిలలోనుండి, రాజప్రాసాదములలోనుండి పట్టణముల రచ్చపట్టులమీఁదకు, ప్రజాజీవిత పరిధులలోనికిఁ దీసికొనివచ్చినాఁడు. నాటకకళ ప్రజాసన్నిహిత మయినదికాని యప్పటికింకను కళలోఁ దగినపరిణతి కనుపింపలేదు. ర్యూడా ప్రదర్శ

నము లిద్దఱు ముగ్గురు గొల్లభామలకు గోపాలురకు మధ్య గేయాత్మక సంవాదములతో నవొక మోస్తరు గొల్లకలాపములవలె నుండెడివి. తదుపరి 'క్యూవా' మొదలైన నాటకకర్తలు స్పెయిను నాటకకళకొక చక్కని జాతీయతాప్రతిపత్తిని సమకూర్చుచుండగా నంతలో వెలసినాడు స్పేనిషు నాటకకర్తలందఱకు చక్రవర్తివంటివాఁడొక మహానుభావుఁడు 'లోప్ డి. వేగా'. ప్రపంచవాఙ్మయ నాటకచరిత్రయందే యతనిదొక మహోన్నతస్థానము. అతఁడెంతగొప్పవాఁడనగా నొక జీవితకాలములో 1800 నాటకములు వ్రాసిన వాడెంత గొప్పవాఁడో యంతగొప్పవాఁడు. అక్షరాలా యతనన్ని వ్రాసినాఁడు. ఇన్నిగ్రంథాల నేదేశములో నేకాలములో నెవ్వరును వ్రాసియుండఁబోరు అన్ని నాటకరచనలోను నతని చూపెంతసేపుఁ బ్రజాహృదయమును జూరగొనవలెనని మహాతహాపడుచుండును. అతఁడు మొదటిలో మొరాలిటీలు మొదలైనవేవో గిలుకుచుండెడువాఁడు కాని స్పెయిను రాజధానియయిన మాడ్రిడ్ నగరములో 1579 లో మొట్టమొదటగా స్థిరమైన నాటకశాల వెలయుటతోడనే యది తన కార్యరంగముగాఁ జేసికొని రకరకాల రూపకాలను శరపరంపరగా రచించినాఁడు. అందులో ముఖ్యమైన తరగతులు మూఁడు.

1. వీరశృంగారరసముగా యోధపాత్ర ప్రధానములైనవి. చక్కని సన్నివేశవ్యూహము వీని జీవలక్షణము. వీనిలో హాస్యమంగముగా నొక ప్రాసంగికేతివృత్తముకూడ నుండెడిది. ఇందులోని హాస్యపాత్రలు జీవమూర్తులు. ఆపాత్రల ప్రసంగములు సామెతల కామెతలు. స్పెయిను జాతీయనాటక రీతులలో

నమిత ప్రజాభిమానము చూఱగొనిన తరగతియిది. ఈనాటక వస్తువుల కితర దేశ నాటకకర్త లెంతఋణపడియున్నారో చెప్ప లేము. 2. ప్రాచీనచరిత్రలకు రాచపాత్రలకు సంబంధించిన నాటకము లింకొకరకము. ఇందలి రచనారీతులు సంవాద శైలియు నుదాత్తముగానుండును. 3. మఱొకరకము సామాన్యజాతీయ జీవితమును ప్రతిబింబించునవి. మత సంబంధము లైన నాటకములలో నొకవిశేష మేమిటనఁగా నతఁడైక్య త్రయ సిద్ధాంతమును సూత్రప్రాయముగా నామోదించి నాఁడు కాని ప్రజాభిరుచికి, నవరసములకు, ననుగుణముగాఁ దన నాటకప్రక్రియను నడుపుకొనుటలో నాసిద్ధాంతమును పాటింపవలసిన యక్కఱలేకపోయిన దతనికి.

లోప్ డి వేగా తరువాత స్పెయిను దేశపు నాటకరంగమును బరిపాలించిన మహనీయుఁడు పెడ్రో కాల్డెరోన్ డి లాబార్కా. ఈ యిద్దఱు స్పెయిను జాతీయ నాటకరంగమునకు సూర్య చంద్రులవంటి వారు. కాల్డెరోఁ లోప్ వలె నాటక ప్రక్రియలో నవ్యత్వము మఱి సాధింపక పోయినను దన నాటక రచనా రీతులను నాగరికమైన నాజూకులతో తరిణి పట్టినాఁడు. లోప్ వలె వందలకొలది వేలకొలది నాటకములు వ్రాయకపోయినను శతాధికముగనే వ్రాసినాడు. అందులో సుమారు డెబ్బది 'ఆటోస్' అను తరగతికిఁ జెందినవి. అనగా మత సంబంధేతివృత్తములు గలవి. లోప్ ఎటువంటి యితివృత్తము నెత్తుకొనినను నందులో సహజత్వము నిండుగా నుండును. కాల్డెరోఁ ప్రభుత్వోద్యోగి యగుటనో యేమోగాని యతని వస్తూన్మీలన పద్ధతి సమయబద్ధముగా

నుండును. లోప్ భావనలో నేదో విశ్వజనీనత గోచరించును, కాల్డెరోన్ రచనారీతిలో నుదాత్తత గోచరించును. లోప్ వస్తువు పాత్ర యీ రెండును దనకు జక్కగా గుదిరియున్న జాలు సంతృప్తిపడును. కాల్డెరోన్ వానితోఁబాటొక చిన్న సందేశము నందజేయుటకుఁ గూడఁ బ్రయత్నించును. లోప్ విశ్వతోముఖమైన సృష్టి చేసినను నాతని ప్రతిష్ఠ స్పెయిను దేశము దాటి రాలేదు. (ఏదో యిటీవల నితర దేశములలో నక్కడక్కడ నతనిపేరు పొక్కినది) దానికి గారణ మతఁడు రచనలోఁ జూపిన యశ్రద్ధయే. కాల్డెరోన్ స్పెయిను నాటక చరిత్రలో నొక యుగ ప్రతినిధి మాత్రమే కాక విదేశములలో గూడ విశాల యశస్సు పొందగలిగినాఁడు. దానికిఁ గళాత్మకముగా నుండు నతని రచనా విధానమే కారణము. అతనికే కాని మానవ జీవితము నెడల విశాలదృక్పథము, సరియైన నాటకరంగౌచిత్య పరిజ్ఞానము మొదలగు గుణములున్నఁ బ్రపంచనాటక చరిత్రలో నతఁడు మఱొక షేక్స్పియరై పోయి యుండెడివాడని కొందఱభియుక్తుల యభిప్రాయము.

ఇటలీ ఫ్రెంచి ఇంగ్లీషు సాహిత్యములపై నీలోప్ కాల్డెరోనల రచనల ప్రభావ మింతయు నంతయుఁగాదు. గాల్డోనీ, నోటా, గిరాడ్ మొ॥ ఇటలీ రచయితలు; కార్నిలి మోలియర్, లిసేజ్ మొ॥ ఫ్రెంచి రచయితలు; బ్యోమంట్, ఫ్లెచర్, డ్రైడెన్, కాంగ్రీవ్, వైచెర్లీ మొ॥ ఆంగ్లరచయితలు స్పెయిను నాటకములలోని ముఖ్యముగా లోప్ కాల్డెరోన్ల రచనలలోని యంకముల కంకములను, గ్రంథాలకు గ్రంథాలనే పరివర్తించి, యనువదించి పరిపరివిధముల నుప

యోగించుకొనినారు. నిజము చెప్పవలెనన్నచో నర్వాచీన యూరపు నాటకకళ అతి మాత్రముగ స్పెయిను నాటక ప్రభావ పరామృష్టమైనది. కాని యానాఁటి స్పెయిను నాటక కళయొక్క సాహిత్యపు విలువకు నిలుకడ లేకపోయినది. దానిలో నాటకీయత కున్నంత సత్త సాహిత్యమునకు లేక పోయినది. 17 శ॥లో స్పెయినులోఁ బ్రజాభిమానము చూరఁ గొనిన మఱొక నాటకకర్త మొరెటో. అతనికి నాటకరంగ ములో నతిసన్నిహితమైన పరిచయముండుటచేత నతని నాట కములలోని యంకరంగవిభాగము, సన్నివేశ ప్రకల్పనము చక్కని శిల్పమర్యాదలతో నలరారుచుండును. పాత్రచిత్రణ సజీవముగ నుండును. 17 శ॥ తరువాత సుమారొక యర్ధ శతాబ్దిదాఁక స్పెయిను నాటకకళకు దుర్దశ పట్టినది. 18 శ॥ ఆరంభములో ఫ్రెంచి నాటకానువాదములు ననుకరణలు కొన్ని సాగినను నవియేవియు స్పెయిను జాతీయ నాటక కళలోఁ దగిన మార్పుఁగాని యభివృద్ధిఁగాని తీసికొనిరా లేక పోయినవి. ఆశతాబ్ది యుత్తరార్ధములో స్పెయిను జాతీయ నాటకకళ నుద్ధరించినవాఁడు రమోన్ డి లా క్రెజ్. అతఁడు సామాన్యజనుల జీవిత చిత్రిణలతో సురుచిర హాస్యముతో వందలకొలఁది నాటకములు వ్రాసినాఁడు. తదుపరి మొరెటిన్ రచించిన వచన మోదాంతములు రంగముపై రాణించి యతని నాకాలపు నాటకకర్తలలో నగ్రగణ్యునిగా నిరూ పించినవి. 19 వ శతాబ్ది యారంభములో 'రొమాంటక్' ఉద్యమము బయలుదేఱి నాటకకళ నవ్యచైతన్యముతో రక రకముల ప్రక్రియలతో రాణించినది. సమకాలిక రాజకీయ

సాంఘిక సిద్ధాంతములకు సమస్యలకు నాటకములలో నవ కాశములు కల్పింపఁబడినవి. ఒక చిన్నవిశేష మేమిటనఁగా 1867 లో టమయోబాస్ వ్రాసిన అన్ డ్రామా న్యూవో అను నాటకములో షేక్స్పియర్ ఒకపాత్ర. దీనినిఁబట్టి యానాఁటి స్పెయినువారికి షేక్స్పియర్ అన నెంతమోజు కలదో తెలియుచున్నది. స్పెయిను నాటకములపై నాంగ్ల నాటక ప్రభావము పడినట్లు కూడఁ దెలియుచున్నది. ఈనాఁటి స్పెయిను నాటకరచయితలలో న తర్జాతీయదృష్టి నాకర్షిం చినవాఁడు ఎచెగారే. స్పెయినులో నేఁడు చిన్నచిన్న నాట కములకు ఆపెరాలకును 'చలామణీ' యెక్కువగా నున్నది.

ఫ్రాన్సు :—

16శ॥లో ఫ్రెంచి నాటక వాఙ్మయముపై ఇటాలి యన్ హ్యూమనిజమ్, స్పేనిషురొమాంటిసిజమ్ ఉద్యమాల ప్రభావము పడినది. ఆనాఁటి ఫ్రెంచి నాటకకర్తలైన జొడెల్లె ట్రాజెడీలపైన మొదటిదాని ప్రభావము (అతని క్లియో పాత్ర డైడెక్ అను నాటకములు సెనేకా అను ఇటాలియను నాటక రచయిత కృతుల కతి విధేయముగా నడచిన యనుకృతులు). అలెగ్జాండరు హార్డీ యొక్క ట్రాజీ- కామె డీలపైన రెండవదాని ప్రభావము గోచరించును.

ప్రసిద్ధులైన ఫ్రెంచి నాటకకర్తలలో మొదటివాఁడు కొర్నెల్లి (1606–89) అతని నాటకములలోఁ బ్రథమ గణ్యా మైన 'లేసిడ్' అనుదాని కొక స్పేనిషు మాతృక యున్నది. ఇందులో నైకత్రయ సిద్ధాంతము పాటింపఁబడలేదు. ఫ్రెంచి సాహిత్య పరిషత్తాక్షేపణఁ జేసినది. అందుకొఱకు కొర్నెల్లీ

తన పిదప రచనలలోఁ బ్రాఁత నియమములకు బద్ధుఁడు కావలసి వచ్చినది. అతని నాటకములు వీరగాథలతో నుదాత్త పాత్రలతో నుదాత్తాశయములతో నసాధారణ సన్నివేశములతోఁ గూడియుండును. ఆ కాలములోనే 'ఫిలిప్పి క్వినాల్ట్' అను నాటకకర్త తన ఆర్మిడె అను ట్రాజెడీ ద్వార మున ఫ్రాన్సులో 'గ్రేండ్ ఆపెరా' కళావిర్భూతికి దోహ దము చేసినాఁడు. అప్పటివాఁడే రేసిన్ అను మఱియొక ప్రసిద్ధనాటకకర్త. అతని వెక్కువగాఁ బ్రణయ సంబంధేతి వృత్తములు. అతని శైలి మృదుమధురముగా నాటకఫక్కికిఁ గుదిరినట్లున్నను గృతకముగా నుండును. ఆడంబరులైన నాగరికుల కితని నాటకములు బాగుగ నచ్చును. ఆ నాఁటి ఫ్రెంచి ట్రాజెడీలలో 14 వ లూయీ ఆస్థానవైభవము, నాడంబరము బాగుగఁ బ్రతిబింబించినవి. రేసిన్ స్త్రీపాత్ర చిత్రణలలో మంచినైపుణి ప్రదర్శించినాఁడు. పాత్రల యాం తర చైతన్యపు లోతులలోనికిఁ జూడఁ గలిగినాఁడు. ఆధునిక యుగములో మన సత్త్వశాస్త్రముపై నాధారపడి బయలు దేఱిన యొక విశిష్ట నాటకప్రక్రియ కతఁడు మార్గదర్శకుఁ డనిపించుకొనినాఁడు. ఆ శతాబ్దిలో కొర్నెల్లి, రేసిన్ ల ట్రాజెడీల కెక్కువ పరపతి యుండినను ఫ్రెంచి కామెడీ కర్తలందఱకు మకుటమణి యయిన మోలియర్ కూడ నాశతాబ్దిలోఁ బుట్టినవాఁడే. అతఁడు స్వతః మంచి నటుఁడు. ఒక 'దేశద్రిమ్మరి' నాటక మేళమున కధికారి. అది పారిస్‌లో స్థిరనివాసము కల్పించుకొనగనే మోలియర్ కామెడీలకుఁ బరపతి హెచ్చినది. అతఁడు కామెడీ రచననే యెక్కువగా

నాదరించినాఁడు. చాల కామెడీల రచించినాఁడు. అదంతయు నొక యద్భుతమైన సృష్టి. ప్లాటస్, టెరెన్సు మొ. వారి ఇటాలియన్ నాటకములను స్పేనిషు నాటకవస్తువులను రచనా రీతులను బాగుగ నాకళించుకొని కామెడీ కళకు సర్వాంగ సౌష్ఠవము సమకూర్చినాఁడు. అతని కామెడీలన్నియు రంగ ప్రదర్శన సౌలభ్యముఁ గలవి. రసికజనుల హృదయములకుఁ జక్కిలిగింతలు పెట్టఁగల చక్కని హాస్యసారస్యములు ప్రదర్శించుటలో నతి విదగ్ధుఁడు. అతని పాత్రలు మానవతత్త్వము లోని లోపాలను, వైపరీత్యములను జక్కఁగ వ్యక్తము చేయును. అతని కామెడీలు ప్రహసనప్రాయ రచనలే యయిన‌ను వానిలో సాధారణముగ సందేశము కూడ నుండెడిది. అవి యనేక భాషలలోనికి ననూదితములై దేశదేశాల రంగ స్థలములపై నిప్పటికిని రక్తిఁగట్టుచున్నవి.

18 శ. యంతటను కొర్నెల్లి, రేసిన్, మోలియర్ల నాటకాలు యూరపు అంతటను బ్రిత్యేకము ఫ్రాన్సులో నుత్తమాదర్శములుగా నిలచినవి. అప్పటిలో ట్రాజెడీకి మఱల మంచిరోజులు వచ్చినవి. వోల్టెయర్ చేతిలో నానాఁడే కామెడీకి ట్రాజెడీకి గ్రిమముగాఁ బ్రాిచీన నియమ బంధములు సడలి పోవుచువచ్చినవి. కరుణరసాత్మకమైన యొక రకపు కామెడీకిఁ బ్రిజాదరణ హెచ్చినది. లక్ష్య కోశము ద్వారమునను లక్షణ విచారణద్వారమునను దానికిఁ బ్రితిష్ఠఁ జేకూర్చినవాఁడు డైడెరాట్. ఈ కామెడీ సామాన్య జన జీవితమునకు సంబంధించిన యొక రకపు ట్రాజెడీ ప్రిక్రియతో సంగమించి 'డ్రీమ్', అను నొక క్రొత్తపేరుక్రింద

చలామణి యయినది. 19 శ. ఆరంభముతో 'రొమాంటిక్' ఉద్యమము బయలుదేఱి రచయితలకు మఱికొంత స్వేచ్ఛ వచ్చినది ప్రతిభాశాలురైన విక్టర్ హ్యూగో, డ్యూమాస్ మొదలైనవారు రొమాంటిక్ నాటకప్రక్రియకు మార్గ దర్శకులయినారు. 19శ నడుమ కడమ దేశములలో రంగమున కెక్కిన నాటకములలో సాహిత్యపు పస తక్కువై పోవుచుం డెడిది. ఫ్రాన్సులో నింకను డ్యూమాస్ (యంగ్), ఆగి యర్ మొదలగు వారి నాటక రచనలలో సాహిత్యశక్తి యుట్టిపడుచుండెడిది. అవి రంగము మీఁద బాగుగ రాణిం చినవే. ఈనాఁటికిని హెర్వ్యూ, రోస్టండ్ అనోవిల్ మొద లగువారి రచనలు చూచిన స్వతంత్రముగా జాతీయ నాటక కళాగౌరవము నిలబెట్టుకొనిన ఫ్రెంచివారి 'నిజాయతి' ఋజువగును.

స్కాండినేవియా:—

నార్వే డెన్మార్కు స్వీడను దేశములు కలసి స్కాండి నేవియా ద్వీపకల్పముగా వ్యవహరింపబడుచున్నవి. నార్వేలో 19 శకిముందు నాటక మొక ప్రత్యేక కళాప్రక్రియగా సాహిత్య శాఖగాఁ బరిణతి పొందిన జాడ కనిపింపదు. అసలు నార్వేలో జాతీయ నాటకోద్యమము బయలుదేఱుటకుఁ దగిన పరిస్థితులే లేవు. ఆనాఁడు డెన్మార్కులోను స్వీడనులోను మాత్రమేవో మిస్టరీలు, మిరకిల్సు, ప్రాఁతబాణీ ట్రాజెడీలు, కామెడీలు మాత్ర మంతకుముందే యప్పుడప్పు డాడఁబడుట కలదు అసలు స్కాండినేవియా ఐరోపా ఖండమున కయిమూలగా నున్న ద్వీపకల్పమగుటవలన నక్కడ ఖండాంతర నాగరి

కతకు శీఘ్రవ్యాప్తి యుండెడిది కాదు. నార్వే, డెన్మార్కు ఉభయ దేశముల వాఙ్మయ పితామహునుగాఁ బరిగణింపఁ బడిన లడ్విగ్ హాల్బర్గు (1684–1754) 18. శ. లో సాహిత్య సృష్టి కుపక్రమించినాఁడు. అతఁడు నార్వేలోఁ బుట్టినను డెన్మార్కులో స్థిరనివాసము కల్పించుకొనినాఁడు అతఁడు మొదటలో మోలియర్ ననుకరించి నాటకరచనఁ జేసినను పాత్రచిత్రణలోను సంభాషణలు నడుపుటలోనుఁ నతి స్వతంత్రుఁడు; చతురుఁడును. 1722 సం॥లో డెన్మార్కులో మొట్ట మొదటగా నొక జాతీయ నాటకశాలకుఁ బ్రారంభోత్సవము జరిగినది. హాల్బర్గు కామెడీ లాసందర్భములోఁ బ్రదర్శింపఁ బడి ప్రజామోదమును బొందినవి. అతని నాటకములలో సార్వకాలికమైన గొప్ప విలువ కలదని పాశ్చాత్య విమర్శకుల తలంపు. 18 శ. యుత్తరార్థములో స్వీడనులో నాటకములకు ఆపెరాలకు రాజావలంబనము కల్గినది. మూఁడవ గస్టవ్ ప్రభువు నాటకకర్తల కాశ్రయదాత యగుటయేకాక తాను స్వయముగా నాటకరచనఁ జేసినాఁడట అతని యాస్థాన నాటకర్తలలో కెల్‌గ్రెన్, ఎడ్లర్ బెత్, లియోపోల్డ్ అను వారు ప్రసిద్ధులు. 19 శ. యారంభములో రొమాంటిక్ మహోద్యమ సంరంభముతో యూరపుఖండమంతయు నుఱ్ఱూతలూగుచుండ స్వీడనులో దాని ప్రభావము సోకిన జాడ కాన్పింపదు. అన్ని దేశములలోను నాటకకళలో నవనవములైన మార్పులు వచ్చుచుండ స్వీడనులో సుమారర్ధ శతాబ్దిదాఁక నాటక సాహిత్యమే లేకపోయినది. అప్పటిలో నార్వే డెన్మార్కు లలోఁ గూడ నించుమించుఁటువంటి పరిస్థితి యుండెడిది కాని

యీపరిస్థితి యెంతో కాలముండలేదు. ఆశతాబ్ది మధ్యభాగము లోనే నార్వేలో సర్వైవోపా నాటకకళా ప్రపంచమునకే యెత్తిన బావుటాయై బయలుదేఱినాఁడు. ఇబ్సెన్ మహాకవి (1828–1906). ఐరోపాఖండమంతట నాధునిక నాటక పితామహుడుగాఁ బరిగణింపఁ బడుచున్నాడతడు. అతడు మొదటిలో నొక నాటకశాల పెత్తనము వహించి తన పర్యవేక్షణలో నాటక ప్రదర్శనలు నిర్వహించుచుండెడివాఁడు, వాని వలన గడించిన యనుభవముతో నాటకరచనఁ బ్రారంభించినాఁడు. మొదట నార్వే చారిత్రాత్మక నాటకములు రచించుచు వచ్చినాఁడు. తరువాత వాస్తవికతకు సన్నిహితముగా సాంఘికసమస్యలకు సంస్కార మార్గములకు సంబంధించిన యితివృత్తములను చేపట్టినాడు. వస్తువులోనే కాదు రచనాశిల్పములోఁగూడ వాస్తవికతను బాటించినాఁడు. క్రొత్త క్రొత్త వింత వింత ప్రయోగములు మార్పులు చేసినాఁడు మానవ మనస్తత్వ విశేష పరిజ్ఞానముతోఁ బరస్పర విభిన్న భావ సంఘర్షణలతోఁ బ్రతియోగ సంఘటనలతో ననేక నాటకములు రచించినాఁడు. అతని నాటకములలో సర్వసాధారణముగా రంగనిర్మాణమునకు సంబంధించిన ప్రత్యంగ వర్ణన యుండెడిది. ఈ వర్ణన లానాటకముల సాహిత్యపు విలువ నెక్కువ చేయునవిగా నుండును నాటకము నూరక చదువునప్పుడుకూడ రంగమును మనో నయన గోచరము చేయును. అతని నాటకములలోఁ బ్రసిద్ధమైనవి డాల్సహౌసీ ఘోస్ట్స్, పీర్ జింట్, ఎనిమీ ఆఫ్ ది పీపుల్ మొదలైనవి.

సంచలనము చెలరేగినను గ్రమముగా యూరపు నంతటను నతని కనుయాయులు బయల్దేఱినారు బెర్నార్డుషా నంతటి వానిమీదనే యతని ప్రభావము తప్పలేదు.

ఇబ్సెనుతోపాటు పేర్కొనఁదగిన మఱొక నార్వేజి యను మహానాటకకర్త బ్జోర్న్సన్ (Bjornson) (1832 - 1910). ఇతఁడు ఇబ్సెనుకు మిత్రుఁడు. ఇబ్సెనువలె గొప్ప నాటకసృష్టిఁ జేసినాఁడు. ఇద్దఱి రచనారీతులకుఁ బోలికలు కూడ కలవు. కాని స్థితప్రజ్ఞత్వములో స్తిమితహృదయత్వ ములో మానవతయెడల నుండవలసిన సానుభూతిలో నితఁడు ఇబ్సెను నతిశయించునని కూడఁ జెప్పవచ్చును, ఎన్‌హాన్స్కా అనునది యితని నాటకములలోఁ బ్రసిద్ధమైనది. ఇతఁడు 'నోబెల్' బహుమాన ప్రతిగ్రహీత.

20 శ॥ ఉత్తరార్ధములో స్వీడనులో ఖండాంతర ఖ్యాతిఁ గనిన యూరపు నాటకకర్తలతోఁ దులతూఁగు మహానుభావుఁ డొకఁ డుదయించినాఁడు. అతఁడు ఆగస్ట్ స్ట్రిండ్‌బర్గ్ (1849-1912) ఇతని గొప్పతన మొక్కమాటలో చెప్పవలెనన్న ఇబ్సెనంతటి వాఁడనినను సరిపోదేమో అనిపిం చును. ఒక ఇబ్సెనును దప్ప నాధునికయుగములో నాటక కళపై నింత పలుకుబడి చలాయించినవాఁడు మఱిలేఁడు. యూరపు ఖండాంతర నాటకకళలో నుక్తిపైచిత్రి, భావగోప నము మానవుని యాంతరచైతన్యము మొదలగు విషయము లకు సంబంధించిన రకరకముల పోకడల కితఁడే యెక్కువగాఁ గారణభూతుఁ డయ్యెనని విమర్శకుల భావన. అతని నాటక ములలో 'డిఫాదర్', 'మాస్టర్ ఒలోఫ్' అనునవి చాల

గొప్పవని చెప్పుదురు. స్కాండినేవియాలో నొక్కసారి ముగ్గురు గొప్ప నాటకకర్త లుదయించుటచే నాటకకళ విషయమై దాని ప్రాచీనప్రతిష్ఠ యెటులున్నను నాధునిక యుగములో నొక్కతరములోఁ జరితార్థమైనదని చెప్పవలయును.

ఇంగ్లండు :—

ఇంగ్లండులో 16 వ శ. దాఁక మిరకిల్సు, మొరాలిటీస్ మొదలగు ప్రదర్శనలు సాగుచుండెడివి. అయితే వానిలో మతాశయ ప్రతిపత్తి దిగజారిపోయి తఱచు లోకముపోకడలే స్ఫురించుచు వచ్చినవి. లిండ్సే, జాన్ బేల్ అను నాటకకర్త లీపరిణామమునకుఁ జాలవఱకు కారకులు. అప్పటిలో 'హేవుడ్' అను నాయన 'ఇంటర్లూడ్స్' అనుపేర యదార్థ సంఘటనలతోఁ జిన్నచిన్న ప్రహసనప్రాయములైన రచనలఁ జేసినాఁడు. వెనుకటితరము ఆంగ్లనాటకములలో గ్రీకు ఇటలీ నాటకపు పోకడలకే పలుకుబడి యుండెడిది కాని లిండ్సే ప్రభృతుల రచనలతో నాంగ్లజాతీయ నాటకకళ కొక సుగమమైన మార్గ మేర్పడినదని చెప్పవచ్చును. 16 శ. నడుమ ఎలిజబెత్ రాణి యాంగ్లసింహాసనము నధిష్ఠించినది. ఆ మహారాణి రాజ్యకాల మాంగ్లదేశచరిత్రలో నొక స్వర్ణయుగము. ఆమె యాసానమునుండి నలుదిక్కులకు సవ్యనాగరికతా సౌరభములు గుబాళించినవి. ఆంగ్లదేశపు సాహిత్యము, నాటకకళయు నవనవచైతన్య ప్రవర్ధమానములగుచుండెడివి. మార్లో, గ్రీన్, లిలీ, కిడ్ మొ॥ ప్రతిభాశాలురైన నాటకకర్తలు బయలుదేఱినారు. వారిలో స్వతంత్రవివేచనయు నిర్మాణశక్తులును గోచరించినవి. కాని యొక్కొక్కరిలో

వివిధనాటక రచనోచిత గుణములు, నేర్పులు నొక్కొక్క విధముగా విప్రకీర్ణముగా మాత్రమే యున్నవి. అవన్నియు నిక నొక మహానుభావుని విశ్వతోముఖసృష్టిలో విలీనము కావలసి యున్నవి. అతఁడే జగజ్జేగీయమాన ప్రతిష్ఠామహితుఁడు షేక్స్పియర్ మహాకవి ప్రపంచ నాటక చరిత్రలో నతని జన్మమొక యుపతారము (1564–1616). అతని నాటక వాఙ్మయ మొక యద్భుతసృష్టి. విశ్వతోముఖమైన యీ సృష్టిలో వాస్తవికజగత్తులోని వ్యక్తులలోని, మనస్తత్వముల లోని సన్నివేశములలోని వైవిధ్యమంతయు గోచరించును. ఆ పాత్రలు సజీవవ్యక్తుల ప్రతినిధులు, నిత్యనూతన చైతన్య విరాజితములు. చదువుచున్నపుడు కూడ నా సన్నివేశములు కన్నులకుఁ గట్టినట్లుండును. ఆ పాత్ర చిత్రణలో సన్నివేశ ప్రకల్పనలో శిల్పసంఘటనలో కథావిష్కరణలో, రసజనక సామగ్రీ సజ్జీకరణలో, సంవాదరచనలో వ్యంగ్యమర్యాదలో శైలిలో, భాషలో, భావాలలో నాశయాలలో నాదర్శాలలో నొక టేమిటి సర్వవిధ నాటకరచనా నైపుణులలో నందె వేసిన చేయియతనిది. అతనినాటకములలో విషాదాంతములు, మోదాంతములు,నుభయములు, చరిత్రాత్మకములు,సాంఘికములు నున్నవి. విషాదాంత రచనాప్రక్రియలో నతనిదొక ప్రత్యేకత. అసలు తత్వతః గ్రీకు ట్రాజెడీకి ఎలిజబెతెన్ ట్రాజెడీకి ప్రధాన భేద మొకటున్నది. గ్రీకు ట్రాజెడీలోఁ బాత్రలకు వ్యక్తిత్వము లేదు. పర్యవసానము దైవఘటనవలె నుండును, ఎలిజబెతెన్ ట్రాజెడీలో నా విషాదాంతావరణము సహజముగాఁ బాత్రల హృదయములలో నుండి ప్రవృత్తులలో నుండి యుద్భుద్ధమై

కొన్ని యక్షగానములనియే వ్యవహృతము లైనవి. కొన్ని నాటక నామకరణమునే చేయించుకొన్నవి. ఈజాతి కృతి రచన ఏమంత ప్రాచీనమైనదిగా తోపదు. ఏ పందొమ్మిదవ శతాబ్దియందో యక్షగాన మొరవడిగా బయలుదేరిన దను కొందును. అదియుగాక, తెలుగునందు మాత్రమే ఈ పేరింట ప్రబంధములు పది పండ్రెండు గన్పట్టుచున్నవి. ఉదా: యడవల్లి సర్వేశ్వర శాస్త్రి ఉమామహేశ్వరైకాంతసేవ, మద్దిరాల వెంకటరాయకవి ఏకాంతసేవావిలాసము మొదలగునవి.

హరికథలు :—

హరికథా కాలక్షేప సంప్రదాయము మనకు మహారాష్ట్రమునుండి సంక్రమించిన దనియు, ఇందులకు తుకారాముని అభంగములు మూలము లనియు, అభిజ్ఞుల భావన కావచ్చును. మరాటీ అభంగములు, తమిళదేశమునందలి భాగవత కాలక్షేపములు, కన్నడ తాళమద్దళ, తెనుగు హరికథలు అన్నియు నొక్కకోవకు చెందునట్టివి. ప్రాయికముగా నన్నియు వివిధ భాగవతోపాఖ్యానము లితివృత్తము గలవి. రచనలో యక్షగాన ప్రాయములు. దక్షిణదేశమున నివి గత శతాబ్దిలోనే ప్రవర్తిల్లి, జనసామాన్యమున విశేష ప్రచారమును బొందినవి. గాన రూప కథాఖ్యానము వీని ప్రధాన స్వరూపము. భక్తిభావ ప్రబోధలక్షణము వీని జీవలక్షణము. భక్తితత్త్వవ్యాప్తికిని గొప్పదోహదకారు లైనవి. కథాశ్రవణ ప్రవణమైన ప్రజాభిరుచికి చాల సంతృప్తిని గూడ నొడగూర్చినవి.

అరవదేశమున గోపాలకృష్ణ భారతి, మలయాళమున కృష్ణన్ తంపి మొదలగు వారివలె ఆంధ్రమున హరికథా ప్రవ

ర్తకులలో నగ్రగణ్యుడు (శ్రీ) మ ద జ్జాడాదిభట్ల నారాయణ దాసు. ఆంధ్ర హరికథా పితామహు డతడు. హరికథా రచనము నందేకాక, ఆఖ్యానము నందును ఆరితేరిన జాణ డతడు. అతని హరికథ లాంధ్రదేశము నందలి యాబాలగోపాలమును ఆనందాబ్ధి నోల లాడించినవి. ఆయనవి, బాగేపల్లి అనంత రామాచార్య బాలాజీదాస ప్రభృతులవి హరికథ లాంధ్రమున వందకు పై చిలుకు గలవు అందెక్కువ మహాభక్తులును ప్రౌఢులు నైన పండితకవుల రచనలు, ఆ రచనా ప్రక్రియయు వివిధ గద్య పద్య గీతి రీతుల కాలవాల మగుట వలనను, విశిష్టప్రయోజనాత్మక మగుటయు హరికథలను గూడ ఉదాహరణాదులవలె మన యొక ప్రత్యేక వాఙ్మయ శాఖగా పరిగణింపవచ్చును.

ఇట్లు బహు ముఖముల ప్రవృత్తమైన భక్తితత్త్వము భారతజాతిని, ఆ భక్తి రచనా పరంపర భారతీయ భాషా వాఙ్మయములను పునీతము- పరి పుష్టము నొనర్చినవని నిరూపించుటయే ఈ రచనయొక్క ముఖ్యోద్దేశము. ఈ భక్తి వాఙ్మయ శాఖల గూర్చి యింకను విపుల విమర్శయు, పరిశోధనము బాగుగా జరుగవలసియున్నది.

---

# తరతరాలు ... తెలుగుభాష

అతిప్రాచీన ప్రతిష్ఠలుగల మహాజాతులలో ఆంధ్రజాతి యొకటి. ఆ జాతిచరిత్ర మహోజ్జ్వలమైనది. ఒకప్పుడువింధ్యకు దక్షిణమున విశాల భూభాగము ఆంధ్ర సామ్రాజ్యముగా అలరారుచుండెడిది. ఇప్పుడును హైదరాబాదు రాజధానిగా తూర్పున బంగాళాఖాతము, పడమట కర్ణాటక మహారాష్ట్రములు, ఉత్తరమున ఉత్కళ మధ్యప్రదేశములు దక్షిణమున తమిళ దేశములు సరిహద్దులుగాగల విశాలదేశ మంతయు ఆంధ్రప్రదేశమని వ్యవహరింపబడుచున్నది. ఈనాడాంధ్రులీ యాంధ్రదేశమునందేగాక వివిధ భారతీయ ప్రాంతములందును, విదేశములందును గూడ స్థావరము లేర్పరచుకొని యున్నారు. కొందరు తమ ఆచార వ్యవహారములను భాషాసంస్కృతులను యితరప్రాంతములందు వ్యాపింప జేసినారు. అవకాశములేక కొందరవి కోల్పోయియున్నను కొందరింకను నిలుపుకొనియుండుట యెంతయు ముదావహము. ఒక్క ఆంధ్రప్రదేశములోనున్న ఆంధ్రుల సంఖ్యయే ముక్కోటిపై చిలుకున్నది నేడు. వీరందరి మాతృభాష ఆంధ్రము ఆంధ్రమునకే 'తెనుఁగు' 'తెలుఁగు' లేక 'త్రిలింగభాష' అనియు పేళ్లు. ఆంధ్రశబ్దము జాతి వాచి. 'తెనుఁగు' దిగ్వాచి. 'తెలుఁగు' లేక 'త్రిలింగము' దేశవాచి. కాలక్రమమునవివి యన్నియు ఆప్రదేశమున ఆజాతివారు వ్యవహరించు భాషకు పర్యాయవాచకము లైనవి. ఈనాడు విభక్త భారతమున

హిందీ తరువాత విపులవ్యాప్తినంది యున్న భాషలలో ఆంధ్ర
ముదే ప్రధాన స్థానము. అందులేనాడో 'దేశభాషలందు
తెనుగు లెస్స' అను 'కితాబు' పొందినదాంధ్రము; అది విదే
శీయులవలననే 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్టు' అను పొగడ్త
నందినది. ఈ కితాబులు దాని నిసర్గమనోజ్ఞమైన మార్దవ
మును మహత్తను సూచించును.

'జనని సమస్తభాషలకు సంస్కృతము' అనియు తెలుగు
సంస్కృతజన్యమనియు నొక యభిప్రాయము. ఒక కోవకు
చెందిన పండితులలో కొందరియెడ పాతుకొనియున్నది. ఇది
చాలకాలమునుండి వచ్చుచున్న యభిప్రాయమే కాని భాషా
శాస్త్రవిషయమున విశేషముగ పరిశోధనలు జరుగుచున్న
నేడును నట్టి యభిప్రాయముండుట శోచనీయము. క్రీ.శ. 19వ
శతాబ్దినుండి బిషప్ కాల్డ్వెల్ ప్రభృతులవలన జరిగిన భాషా
శాస్త్ర పరిశోధనల ఫలితముగా తెలుగునకు సంస్కృత
ప్రాకృతములతో విశేష సంబంధమున్నమాట వాస్తవమే
కాని అది జన్యజనక సంబంధము గాదనియు. తమిళ, కన్నడ,
మళయాళాది భాషలతోపాటు తెలుగుకూడ భారతదేశమున
అతి ప్రాచీనమగు ద్రావిడభాషా కుటుంబమునకే చెందిన
దనియు ఋజువైనది ‡ (నేనిపుడా చర్చ కిట ప్రసక్తి కల్పిం
చుట యనవసరము.

---

‡ చూ. **A Comparative Grammar of the Dravidian Languages By Bishop Coldwell.** విద్వాన్ శ్రీ గంటి జోగిసోమ యాజిగారి 'ద్రావిడభాషలు' అను గ్రంథము.

ఒకకాలమున నొక ప్రాంతమంతట నేకైకముగా వ్యవహారమందుండిన భాష భిన్నకాలమందు భిన్నమండల వ్యవహారమున సాంఘిక చారిత్రిక భౌగోళికాద్యనేక కారణములచే చీలికలు వాలికలునై కాలక్రమమున భిన్నభాషలుగా పరిగణింపబడుట జూచుచున్నాము. అట్లే సుమారు రెండు వేల సంవత్సరముల క్రిందట నేకరూపమున నుండిన మూల ద్రావిడభాష కాలక్రమమున తమిళము, కన్నడము, తెలుగు, మళయాళము మున్నగు బహుభిన్నభాషలుగా విడిపోయినది. అందు తెలుగుభాష చరిత్రమించుక పరిశీలించుట ప్రస్తుత కర్తవ్యము. ప్రకృతమిది స్థూలమైన పరిశీలనము మాత్రము.*

స్థూలముగా జూచినచో ఆంధ్రభాషాచరిత్రమున పరిణామ క్రమమునుబట్టి యొకవిధమగువిభాగము సాధ్యపడును. అందు మొదటిది— క్రీ. శ 6వ శతాబ్దివరకు గల కాలమును అజ్ఞాతయుగము లేక ప్రాచీనయుగము అని పేర్కొనవచ్చును. ఈకాలమున తెలుగుభాషయొక్క రూపురేఖలు తేటపడలేదు. అప్పటికి తెలుగున శాసనములైనను వెలసినజాడ కన్పట్టదు. అతఃపూర్వము తెలుగునేల నేలిన శాతవాహనేక్ష్వాకు శాలంకాయన విష్ణుకుండిన ప్రభృతులైన ప్రభువంశముల వారి శాసన పరంపరయంతయు సంస్కృత ప్రాకృతమయము. ఆశాసనములలోనే అందందు సకృత్ప్రయుక్తములైన సంస్కృత ప్రాకృతేతర శబ్దములు కొన్ని అర్వాచీ

* సమగ్రము, సమ్యక్సుందరమునైన ఆంధ్రభాషా చరిత్రమునకు చూ. ఆంధ్రభాషా చరిత్రచతురానన ఆచార్య శ్రీ గంటి జోగిసోమయాజి గారి 'ఆంధ్రభాషావికాసము' అను గ్రంథరాజము.

నాం భాషా శాసనములలోని పదముల వ్యాకరణరూపములుగా గ్రహింప వీలువడుచున్నవి. అనగా అప్పటికి తెనుగుదేశమున పాలక వ్యవహారమందుండిన సంస్కృత ప్రాకృతములకు భిన్నమై స్థానికముగా జనసామాన్య వ్యవహారమందొక విశిష్టమైన భాషయుండెనని యూహింప నవకాశముగలదు. ఆ పదము లెక్కువగా తెలుగు దేశమందలి గ్రామనామములు వ్యక్తివాచక శబ్దములు తెలుగు విభక్తి ప్రత్యయముల పూర్వరూపములు మొదలగునవి. వానియన్నింటిని బట్టిచూడ అది ఆ ద్రావిడమునుండి వేర్పడి తెలుగు పొడసూపుచుండిన కాలమని చెప్పనగును.

రెండవయుగము చాళుక్యయుగము లేక ప్రాఙ్నన్నయ యుగము (క్రీ.శ. 6 వ శతాబ్దినుండి 11 వ శతాబ్ది వరకు)— ఈ యుగమున తెలుగు దేశము నేలిన పూర్వచాళుక్య ప్రభువుల ప్రాపున తెనుగునకు గొంత ప్రాముఖ్యము వచ్చినది. వారి సంస్కృత శాసనములందు తెనుగు పదములు విరివిగా గన్పట్టుచున్నవి అసలు వారు ప్రత్యేకముగా తెనుగునందును శాసనములు వేయించిరి. వారికాలమున తెనుగు రాజభాషగా వ్యవహరింపబడినది; సాహిత్యస్థితికిని వచ్చినది. అందులకే నన్నెచోడుడు తన కుమారసంభవ కావ్యావతారికలో చాళుక్యనృపులు 'తెనుంగు నిలిపి రంధ్రవిషయమున' అని యుగ్గడించియున్నాడు. ఆ కాలమున నేటి కడప కందనవోలు సీమలలో సత్యాదిత్యాది రేనాటి చోళప్రభువులచే చేయబడిన తెనుగు శాసనము లానాటి తెలుగుభాషా స్వరూపమును బాగుగా నిరూపింపగలవు.

మూడవది నన్నయ యుగము (క్రీ.శ. 11-వ శతాబ్ది):-
నన్నయభట్టారకు నవతారముతో ఆంధ్రభాషా వాఙ్మయ చరిత్రలో ఆచంద్ర తారార్క యశః స్థాయియగు నొక యపూర్వ నూత్న యుగోదయమైనది. ఆతడు క్రీ.శ 1022-63 సంవత్సరముల నడుమ ఆంధ్రరాష్ట్ర హృదయస్థానమగు గోదావరీ మండలము లేక వేంగీదేశమును రాజమహేంద్రవరము రాజధానిగా పరిపాలించిన పూర్వచాళుక్య ప్రభువగు రాజరాజనరేంద్రుని ఆస్థాన విద్వత్కవి. అతడా ప్రభుశేఖరు నభీష్టముగా సంస్కృత మహాభారతము నాంధ్రీకరించుటకు బూనుకొన్నాడు. అప్పటికి తెనుగొక ప్రత్యేకభాషగా పరిగణింప బడుచున్నదే కాని దాని కొక చక్కని వ్యవస్థలేదు. అందులకా నాటి మన శాసనములే తార్కాణము, వాఙ్మయ మసలే లేదు. అసలే లేదనగా మహాభారతమువంటి మహాగ్రంథ మొక దేశభాషలో వెలయుటకా భాషలో స్వతః ఏకొంచెమో శక్తి యుండవలె. అయితే పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో చెప్పినట్లు ఏవో కొన్ని అల్లిబిల్లి పదములు, పాటలు, చాటువులవంటి ముక్తకరచనలు, ఆయా శాసనము లందలి పద్యములును తప్ప నిబద్ధ కావ్యజాలము వెలసిన జాడ కానరాదు. మన కుపలబ్ధమైనంతలో నన్నయగారి మహాభారతమే ఆంధ్రభాషలో ఆదికావ్యము.

ఆయన తన నాటి ఆంధ్రభాష యొక్క అవ్యవస్థను గుర్తించినాడు. మహాభారతమువంటి మహాగ్రంథముయొక్క బహుముఖార్థభారమును భరింపగల శబ్దశక్తి శబ్దజాల వైశాల్యము తెనుగునకు చాలదని గుర్తించినాడు. తననాటి శిష్ట

జనుల సంస్కృతభాషా విశేషాభిజ్ఞతను, తెనుగుభాషకు ప్రాచీనత్వము, తెనుగుదేశమున ప్రచురముగానుండిన ప్రాకృతముల ప్రాబల్యము, అప్పటికే తెనుగుపై బడిన ఆ సంస్కృత ప్రాకృతముల ప్రభావము, వానితో అనగి పెనగి ఆ యనుబంధము తన కతిసహజమైనట్లుగా తెనుగు పెనుపొందిన తీరును గమనించినాడు భట్టారకుడు. మహాభారత ప్రతిపదార్థము నిరూపించుటకు సమర్థకము, ఆవశ్యకము తెనుగు తీరుతో కలుపుగోరుగా నుండగలట్టిదియు నైన పదజాలమును, పద సంయోజనాపద్ధతిని సంస్కృతప్రాకృతములనుండి గ్రహించి తెనుగులో నొకవిశిష్టమైన కావ్యభాషకు రాజమార్గము నేర్ప రచినా డా మహానుభావుడు. అతని భారతరూపమున ఆంధ్ర భాషకు స్థైర్యము ఉదాత్త లక్ష్యసిద్ధియు నేర్పడుటయే కాక తత్సమాదికముల రూపనిష్పత్తికి ప్రామాణికపథము నేర్పడినది. ఆంధ్రశబ్దచింతామణి రూపమున తెనుగున కాయన చేతిమీదుగనే వ్యాకరణ సంస్కారమును జరిగినదని చాల మంది విద్వాంసుల విశ్వాసము. ఆగ్రంథ మతనిరచన కాదనుకొన్నను అతడు శబ్దశాసనుడే, ఆతని భారతము సర్వలక్ష్య సంగ్రహమే. మాండలికావస్థలోనుండిన భాష కాతనిచేతిలో కావ్యోచితత్వ మహాయోగ మబ్బినది. తనభారతము కాలాంతరమున మండలాంతరమున మహాంధ్రజాతి కంతటికి సర్వము గావలెనని ఆయన ఆశయము. అందులకే స్థిరప్రకృతియు, శిష్టజనాదరమును, విపులవ్యాప్తియు గల సంస్కృతభాషతో అంటుగట్టి ఆంధ్రభాషను కలదుచి ప్రచురమగు కావ్యఫలమును పండించినాడు. ఈఫలసాధుత్వము అపక్వమైన శాసన

భాషను పరిశీలించినచో మరియు స్పష్టముగా తెలియును.
ఆనాటి వ్యవహారికాంధ్ర భాషాస్వరూపము నాశాసనములును,
కావ్య భాషాస్వరూపమును నన్నయగారి భారతభాగమును
నిరూపింపగలవు.

తరువాతిది అర్వాచీనయుగము. (క్రీ॥శ॥ 12 శ॥ నుండి
19 శ॥ వరకు) : గురుపద్యవిద్యకు ఆద్యుడైన నన్నయభట్టు
నుండి అద్యతన గద్య విద్యాధరుడగు చిన్నయసూరి వరకు
నడుమగల ఈ ఎనిమిది శతాబ్దుల కాలము నొక్క యుగము
గనే ఏల పరిగణింపబడినదనగా నాటినుండి నేటిదాక బహు
శాంధ్రోక్తినుయు ప్రపంచమున భట్టారకుని మార్గమే సర్వా
ర్వాచీనులకును పరమ ప్రామాణికమైనది. ఆతడు పెట్టిన
ప్రయోగభిక్షయే సర్వలాక్షణికులకును గ్రాంథికాంధ్రభాషా
ప్రస్థానపాథేయమైనది. ఆయన మహాభారతమువంటి బృహ
త్కథను అర్థయుక్తి ప్రసన్నముగా అక్షరరమ్యముగా నానా
రుచిరార్థసూక్తి సుందరముగా తెనుగున దీర్చుటకు సంస్కృ
తమును బహుధా సమాశ్రయింపవలసి వచ్చినది. అర్వాచీన
కవులు నామార్గమునే అనుసరించిరి. ఆ సంస్కృతానుబం
ధము గాఢమై ధ్రువపడినది. భారత దేశమున ప్రతిరాష్ట్ర
భాషయందును సాహిత్యమేర్పడుటలో నిట్టి పరిస్థితియే తట
స్థించినది. అందుచేతనే ఒక్క ఆంధ్రము విషయముననే
కాదు 'జనని సమస్త భాషలకు సంస్కృతమే' యని పండి
తులు ననుకొను పరిస్థితి కల్గినది. కాని యథార్థముగా కడమ
భాషల విషయ మెట్లున్నను తెనుగుమాత్రము సంస్కృత
ముతో ప్రగాఢమైన అనుబంధము మాత్రమే కలదగునుగాని

జన్మాతసంబంధముకలది మాత్రముకాదు. ఈ అర్వాచీన యుగమును తిరిగి తిక్కన యుగము శివకవియుగము అని ఇట్లొక అవాంతరయుగ విభజనము చేయుట కవకాశము గలదు. తిక్కన భారతరచనలో చిక్కబడిన తెనుగుదనమును అనగా తెనుగు పదముల బాహుళ్యము, నానుడులు, పలుకు బడులు, సామెతలు, జాతీయములు, నుడికారము మున్నగు విషయములను పరిశీలించి చూచినచో అతని కాలమునకు తెనుగుభాషలో సహజము, స్రవము, విస్తృతమునైన అభివృద్ధి స్పష్టముగా పొడగట్టును. 'తన్నహానీయ స్థితిమూలమై' నిలిచిన 'కుండలీ దుర్గిండు' తిక్కన సోమయాజి తననాటి కున్నంత మట్టున కెన్నో తెనుగు పదముల నుపయోగించి నాడు కావ్యపుటాయువు పట్టులందును తెనుగు పదములను ప్రయోగించి వాని జవసత్త్వములను, జీవకళలను నిరూపించి మహాభారత రచన పదేను పర్వములు కొనసాగించినాడు. తెనుగు నుడికారముతో బారలుసాచి 'భారత భారతీసము ద్రము దరియంగ' నీదినాడు. ఆనాటికి తెనగు భాషకు సహ జముగను కవితాప్రతిపత్తికి తగిన 'తాహతు' ఏర్పడినదని ఋజువైనది. నన్నెచోడ పాల్కురికి సోమనాథాది శివకవు లును తిక్కనవలె తెనుగుబాస చక్కందనమును తమ కావ్య దర్శములందు ప్రదర్శించినవారే, '... సంస్కృత భూయిష్ఠ రచన' మానగా సర్వసామాన్యంబుగ మిజాను తెనుంగు విశే షము ప్రసన్నతకు' అనియు, 'సరసమై పరగిన జానుదెనుంగు! చర్చింపంగా సర్వసామాన్యమగుట ......' అనియు తెనుగు బాసయొక్క జానుతనమును వేనోళ్ళ జాటినారు వారు.

అంతేకాదు 'తెలుఁగు మాటలనంగ వలదు వేదముల కం
దియ కాఁజూఁడు' డని హెచ్చరించినారు

వేదవాక్కులతో సమానమైనవట, తెనుగు మాటలు! తెనుగన్న వారి కెంత మమకారము! అట్టి మాతృభాషాభిమానులగు మహానుభావులు కొందరైన లేకున్నచో మన భాషకు సాటిభాషలలో గౌరవాభివృద్ధులు గలుగుటయెట్లు? వారివలన తమిళ కన్నడాదులగు కడమ ద్రావిడ భాషాపదములును వచ్చి చేరి మనభాష మరింత పుష్టినందినది. పదునాల్గవ శతాబ్ది నాటికే 'దేశభాషలయందు తెనుఁగులెస్స' యనిపించుకొనినది (చూ. క్రీడాభిరామ ప్రస్తావన) ఆ యభిప్రాయము పదునారవ శతాబ్దిలో వివిధభాషావిద్వాంసులకు కవులకు నెలవగు శ్రీకృష్ణదేవరాయల కొలువులో దృఢపడి యుండుట మరియు లెస్స (చూ. ఆముక్తమాల్యద- అవతారిక), ఆశతాబ్ది మొదలు నిన్న మొన్నటిదాక అచ్చ తెనుగున స్వచ్ఛందముగా కొంత కావ్యజాలము వెలయుట ఇంకొక విశేషము (ఉదా॥ పొన్నిగంటి తెలగన్న- యయాతి చరిత్ర, కూచిమంచి తిమ్మకవి అచ్చతెనుగు రామాయణము, నలాసుందరీపరిణయము మొ॥) అందలి భాష సంస్కృతసమేతమైనది. పదజాలమే మారినదికాని దాని సాంస్కృతికమైన సంయోజనాపద్ధతి మారలేదు. అందుచే నది అచ్చ తెనుగగునేమో కాని తెనుగువారికి సహజముగా అచ్చివచ్చిన భాష కాదు. అందు కొంత కృత్రిమప్రవృత్తియు గలదు. అయితే ఏదో సంసారపక్షముగనైనను అచ్చికపద కేవలముగా కావ్యరచన చేయుట కవకాశమున్నదను విషయ

మును మనము గ్రహింపవచ్చును. ఈ యుగముననే మరి యొక నూతనాంశమును మనము గుర్తింపగలము. అది అన్యదేశీయ- శబ్దసంక్రమణము. తెనుగుదేశము తురకల బారి బడినప్పటినుండియు అరబీ పారశీక ఉర్దూ హిందీ భాషా శబ్దము లనేకము తెనుగున జేరినవి. దేశ వ్యవహారమున విశేషప్రచారమంది సాహిత్యమునను చిరస్థాయిగా పాదుకొన్నవి. తదుపరి వర్తకవ్యాపారాదుల నిమిత్తము మన దేశము వచ్చిన పరాసు పోర్చుగీసు ప్రభృతి పాశ్చాత్త్యుల భాషాపదము లెన్నియో తెనుగున జనవ్యవహారమునను క్రమముగా కొన్ని కావ్యములందును జేరినవి. ఇట్లీ అర్వాచీన యుగమున తెనుగు దేశవ్యవహారమున అన్యదేశ్య సంక్రమణము, తత్రాపి తెనుగు కావ్యభాషలో ఆయా దశలలో సమకాలిక వ్యావహారిక భాషాచ్ఛాయలు పడుటయు జరుగుచు వచ్చినది. కొందరు లాక్షణికులు నాయా క్రొత్త ప్రయోగముల నామోదించుచు వచ్చిరి. క్రీ॥ శ॥ 17, 18 శతాబ్దులలో తంజావూరు, మధుర, మైసూరు, పుదుక్కోట, జింజి మున్నగు ఆంధ్రేతరులైన ప్రభువులచేగూడ ఆంధ్రభాష బహుధా సమాదృతమై విపులవాఙ్మయవంతమై విశేషప్రచారము నందియుండుటొక గొప్ప విశేషము.

ఇక చివరిది ఆధునిక యుగము: (క్రీ.శ. 19వ శతాబ్ది ప్రస్తుతము). ఇది కీ. శే. చిన్నయసూరి, సి. పి. బ్రౌను, కందుకూరి వీరేశలింగము గారలతో నారంభ మయినదని చెప్పవచ్చును. ఆ ముగ్గురు మహనీయులును ఆంధ్రభాష వాఙ్మయములకు శాశ్వతమగు మహోపకారము చేసినారు.

అది వ్యాకరణ నిఘంటు నిర్మాణాదిక బహుముఖ మైనది. ఈయుగమున జరిగిన పరిణామము విషయమున ప్రధానముగా గుర్తింపదగిన అంశములు రెండు : ఆంగ్లభాషా సంపర్కము, వ్యావహారిక భాషావాదము. తెనుగుభాష వెనుక సనాతనములు, ఉన్నతములునగు భావములను వ్యక్తీకరించుటకు సంస్కృతము నాశ్రయించినట్లే యిపుడు నవీనములు, నాగరకములునగు విషయములను, భావములను వ్యక్తీకరించుట కాంగ్లము నాశ్రయింపవలసి వచ్చినది. నడిమికాలము నను నానాభాషలనుండి పదజాలము చాల కలసినది. ఇట్లు తొలుతనుండియు తెలుగునకు అన్యభాషా సంపర్కమే అధికమైనది. ఆనాకిడికి ఒత్తిడికి తెలుగు లొంగిపోయినది. తెనుగునకు పరకీయమైన అభివృద్ధి కొంత జరిగినది కాని సహజమైన స్వకవికాసము లేకుండ బోయినది. సంస్కృతాంగ్లముల విషయమున తెనుగున వాని పదజాలము చేరుటయకాదు, తెనుగుపై వాని వ్యాకరణ ప్రభావముపడినది. దానివలన తెనుగున కారక వైచిత్రిలో పదసంయోజనా పద్ధతిలో, వాక్య నిర్మాణ ప్రక్రియలో విపరీతములైన మార్పులును గలిగినవి. తెనుగు నుడికారము ప్రాచుర్యమును నానాటికి దిగజారుచు వచ్చినది. ఇతర భాషలనుండి తెనుగు సంగ్రహించిన పద జాలము స్వరూప స్వభావములతీరు ముత్తెరగులుగా నున్నది, అన్యపదములు యథాతథముగా గృహీతములై చివర తెలుగు ప్రత్యయములు మాత్రము చేరినవి – వీనిని తత్సమములని పరిగణింపవచ్చును. తెనగు ప్రత్యయములు చేరుటయకాదు, మూలశబ్దస్వరూపము తెలుగువర్ణ సమామ్నాయ నిసర్గ

మార్గమున కనుగోధముగా మార్పుపొందుట- ఇట్టి మార్పుల నందిన పదములను తద్భవములుగా పరిగణింపవచ్చును. శబ్ద స్వరూపములో మార్పువచ్చినను గాకున్నను ఆ శబ్దమునకు మూలభాషలోగల యర్థము తెలుగున విపరిణత మగుట. తత్సమములకంటె తద్భవములు, విపరిణతార్థములునైన శబ్దములవి అన్యదేశ్యములైనను తెనుగుదనము నెక్కువగా నిరూపింపగలవు ఒక భాష అన్యభాషలనుండి పదజాలము నెంతైన గ్రహింపవచ్చును గాని స్వకీయమైన జాతీయతను కోల్పోరాదు.

ఆదినుండియు ఆంధ్రభాషా కూలంకష వ్యావహారిక గ్రాంథిక ప్రయోజనములను నుభయ కూలముల నొరసి ప్రవహించు చున్నది. మొనకటి వ్యావహారి కాంధ్రమునకు ప్రతినిధులు శాసనములును, స్థానిక చరిత్రలును కాగా కావ్యములు, లక్షణగ్రంథములును గ్రాంథికాంధ్రమునకు ప్రతినిధులైనవి. వానిని పరస్పరము బోల్చిచూచినచో వాని భేదము స్పష్టపడగలదు. అయితే ఆ భేదము అర్థము కానియంత అగాధమైనదికాదు అందుచు ప్రాచీన కావ్యములందు వ్యావహారిక ప్రయోగచ్ఛాయలును సమృద్ధిగనే కన్పట్టుచున్నవి. కొన్నిటిని ప్రాచీన లాక్షణికులును అంగీకరించి యున్నారు. అయితే వ్యావహారిక భాషావాద మొక యుద్యమముగా బయలుదేరి ప్రచారమునందిన దీయాధునిక యుగముననే. దీనికి పాశ్చాత్య భాషా వ్యాకరణముల సంపర్కము, పాశ్చాత్య నాగరకతా ప్రభావము, వ్యక్తి స్వాతంత్ర్య వాదము మొదలగునవి మూలకారణములు, ముఖ్యాదోహద

ములు నైనవి. లక్షణము నపేక్షింపక ప్రాదేశికముగా గాని వ్యక్తిగతముగా గాని సిద్ధములైన వాడుకల నుపయోగించుటయు, ఒక పదముగాని ప్రయోగముగాని యది లక్షణానుసారి యగునా కాదా యని విచారింపకుండుటయు అనభిజ్ఞత వలఁ గాని, బుద్ధిపూర్వకముగా గాని స్వాతంత్ర్యమను పేరితో లక్షణము నతిక్రమించుట, పరకీయములైన వాడుకలు, పలుకుబడులు, నుడికారములు తెలుగునకు సరిపడకున్నను మక్కికి మక్కిగా తెనిగించుట—ఇంతయేల ఒక్కమాటలో చెప్పవలెనన్న ఎవరికి తోచినట్లు వారు వ్రాయుట ఈ యుద్యమ ప్రధానాశయముగా లక్షణముగా పరిణమించినది. ఈయుద్యమ ప్రారంభకులు కీ. శే. గిడుగు రామమూర్తి పంతులుగారు. గ్రాంథిక భాషకృతకమైనదనియు వాఙ్మయము సర్వోపభోగ్యము కావలెననియు అందులకు వ్యావహారిక భాష అవశ్య శరణ్య మనియు వారి ఆశయము, వారి వాద సారాంశము. గ్రాంథిక భాషానభిజ్ఞత కావ్యసృష్టికి ప్రబల ప్రతిబంధకముగాకుండ ఆ సృజనాత్మక శక్తిగలవారందరికి వారి కవితా ప్రవృత్తి, ఆశయములు, నుద్దేశములు 'జీర్ణమంగేసుభాషిత' మ్మనునట్లు మనసులోనే జీర్ణించిపోకుండ మాటలలో రూపుకట్టు నవకాశ మేర్పడినది. అందుచే నీ యుగమున రచయితల సంఖ్య అధికమైనది. మన సాహిత్య పరిధి విశాలమైనది. సాహిత్యము విశేషముగ ప్రజాసన్నిహితమునైనది. ఈయుద్యమమువలన ముఖ్యముగా మనభాషకు గలిగిన మేళ్లివి. వీనిని విస్మరింపరాదు. కాని పంతులుగార్రైతే మహాపండితులేగాని వారి అనుయాయులందరు నట్లుకాదు. భాషావిషయకమైన

స్వేచ్ఛ ఏర్పడగానే అనభిజ్ఞులు, అవ్యుత్పన్నులు, అల్పాధికారులునైన రచయితల సంఖ్య అధికమైనది. అందెక్కువ మంది 'గ్రాంథిక విరుద్ధమైనదంతా వ్యావహారికమే' యను నపోహకు లోనగుటచేత వారి వ్రాతలలో, వ్యావహారికమందును కృతకత్వము ప్రబలినది. ఎవరి యిచ్చకు వచ్చినట్లు వారు వ్రాయుచుండుటచే నీవాదము వెర్రితలలు వేసి భాష కొక నియతిలేక ప్రయోగవైవిధ్యముచే బహుధా అవ్యవస్థకు బాల్పడుచున్నది. మాండలికావస్థ నధిగమించిన కావ్యాభాషా ఘంటాపథమున గండ్లును గతుకులును నేర్పడి మన భాష మరల మాండలికావస్థవైపు తిరోగమించుచున్నదనియు, భాష బ్రతుకంతకంతకు అధ్వాన్న మగుచున్నదనియు పండితులు ఘోషించుచున్నారు. 'సంస్కారాద్ధోనియమః' అనునది సార్వత్రికమైన సూత్రము. అది సర్వథా భాషపట్లను సమన్వయించును. వ్యవహారమునందున్న భాష స్వభావతః ఎంత నిరంతర ప్రవంతియైనను కొంతవట్టు తద్విలక్షణముగా తరతరాలుగా పెరుగు వచ్చిన కావ్యభాషకైనను కొంత నిలుకడయు నొక ప్రామాణికమైన స్థితియు నుండుట యవసరము. ఈయుగముననే శిష్టవ్యావహారికమునకు 'ఆంధ్ర భాషానుశాసన' మనుపేర శ్రీమల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారొక వ్యాకరణము వ్రాసియున్నారు. అయితే దానికి తగిన ప్రచార మేర్పడియుండలేదు. అది వ్యావహారిక భాషావాదులకే అందరికి నుపాదేయము కాలేదు. కావ్యభాష యనగా తాత్కాలికముగా సార్వజనీనమగుటకాదు దాని పరమార్థము. అది సార్వకాలికమును సార్వదేశికమును గావలె.

అసలు కావ్యములందరికిని అర్థముగావలె ననుకొనుటలోనే యున్నది పొరపాటు. సంగీతాదులవలె సాహిత్యము సర్వోప భోగయోగ్యమైన కళకాదు. అది తగిన అధికారముగల కొందరికిమాత్రమే పరిమితమైనది. అందుచే ఉన్నతాధి కారము గలవారికొరకు ఉద్దేశింపబడిన కావ్యములందలి భాషయు లగువు బిగువులు గలిగి యుదాత్తముగనే యుండ వలెను. కావ్యభాష లేక గ్రాంథికభాషలోనే నిత్యవ్యవహార ము జరుగవలెనన్నచో అది యెంత అవివేక మనిపించు కొనునో సర్వకావ్యభాషయు వ్యావహారికముగనే సాగవలె ననుకొనుటయు నంత యవివేకమే యగును. కాని తాత్కా లిక ప్రయోజనాత్మకములు సామాజికేతివృత్తములు నగు కథానికా నాటికాది కావ్యప్రక్రియలు, ప్రజలందరికిని దెలియ వలసిన వైజ్ఞానిక విషయాత్మకములగు వ్యాసములు వ్యావ హారికభాషలోనే సాగుట లెస్స. ఉన్నత ప్రయోజనాత్మక ములు, కాలాంతరమున మండలాంతరమున అర్థము కావలసి నవియు నగు కావ్యములందలి భాష ఉన్నతముగ నియమ బద్ధముగ నుండుటయే లెస్స. ఆ భాషాప్రయోగ మాయా కావ్యముల ప్రయోజనము, ప్రక్రియ, సన్నివేశము మొ॥ విషయములపై నాధారపడియుండును.

తెలుగున కావ్యభాష—కన్నడమున పళగన్నడము, నడుగన్నడము, హొసగన్నడము అనియు, ఆంగ్లమున Old English, Middle English, Modern English అనియు నిట్లనేక భాషలలో ప్రాచీన మధ్యాధునిక యుగములు మూ డిట ముత్తెరగులైన అంతరువు లేర్పడినట్లు కాక ఇన్నితరా లుగ ఇంత నిలుకడగా నున్నదనగా నది యొక భాషాచరి

త్రలో మిగుల నపూర్వము, శ్లాఘాపాత్రమునైన విషయమని కొందరు గొప్ప భాషాశాస్త్రవేత్త లూగ్గడించుచున్నారు.

ఇట్టి తెలుగున అతివిశాలము, నమూల్యము నగు సాహిత్యమెంతయో వెలసినది. ఇతర భాషాగ్రంథముల కనువాదములు ననేకము వెలసినవి. ఇప్పుడిపుడే ఇతరభాషల లోనికి తెనుగు గ్రంథములనూదితము లగుచుండుటయు ముదావహమైన విషయము.

గొప్ప గొప్ప పరిశోధనలుచేసి ఆంధ్రభాషకు మహోప కారము చేసిన మహనీయులు కొందరి నిట స్మరించుట కర్త వ్యము. కీ. శే. గిడుగు రామమూర్తి పంతులుగారు, జయంతి రామయ్యగారు, డా. చిలుకూరి నారాయణరావుగారు— వీరి గ్రంథము ఆంధ్రభాషాచరిత్రము. ఆచార్య శ్రీ గంటి జోగి సోమయాజిగారు—ద్రావిడభాషలు, ఆంధ్రభాషావికా సము అనునవి వీరి గ్రంథములు. శ్రీకోరాడ రామకృష్ణయ్య గారు (అనేక భాషాచారిత్రక వ్యాసములు). శ్రీవఝల చిన సీతారామస్వామి శాస్త్రులుగారు–ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము, ద్రావిడభాషా చరిత్రమును వీరి గ్రంథములు.

భాషోపకారకమగు మరియొక గొప్పవిషయ మిట స్మర్తవ్యము: ఇటీవల ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు కేంద్ర ప్రభుత్వ సాహాయ్యమున ఆచార్య శ్రీగంటి జోగిసోమయాజి గారి ఆధ్వర్యమున తెనుగు భాషకొక విపులమైన వ్యుత్పత్తి పదకోశమును వినిర్మించు పథకము నారంభించినారు.

ఇంకను బహువిధమైన ఆధునికయుగోపయోగముల కనుకూలముగ ఆంధ్రభాష ఇతోధికముగ అభివృద్ధినందుగాక!

---

# త్యాగరాజు - కృతులు

త్యాగరాజ కృతులనుసరికి అతని భగవత్ కీర్తనలే స్ఫురించును. అతని వ్యక్తిత్వము భక్తి-సంగీతము అను రెండు మహాప్రవాహముల సంగమక్షేత్రము. కాని యందు కవితయు నంతర్వాహినిగా ప్రవహించుచుండును. అతడు భగవన్నామ కీర్తనలే కాదు భగవన్మహిమా ప్రతిపాదకములు, తత్కీర్తన సనాథములునగు కావ్యములుగూడ నొక మూడు రచించి నాడు. అతని ప్రతికృతియు నొక ప్రయోగ. అతడు ప్రహ్లాదునివంటి భక్తి ప్రపత్తి సంపన్నుడును, నారదునివంటి నాద బ్రహ్మోపాసకుడును మాత్రమే కాదు. మన పోతనవంటి మహాకవియును.

త్యాగయ తనకావ్యములను యక్షగానములని పేర్కొన లేదు కాని రచనా ప్రక్రియ యక్షగాన ప్రాయమైనదే. ఆయనవంటి సంగీతదక్షుల సాహిత్యసృష్టికి దగినట్టి దారచనయే, కాని యతని కావ్యములకు తగిన ప్రచారము లేదు. ఆయనకు సంగీతప్రపంచమున చిరస్థాయియగు స్థానము లభించినది కాని సాహిత్యలోకమున సముచితస్థానము లభించు మాట యటుండ అసలతడొక కవిగా అంత గుర్తింపబడినట్లు లేదు. కారణమతని కావ్యములు యక్షగానప్రాయములగుట కానోపును. ఇంతదనుక మన కవి చరిత్రకారులు, పద్యబద్ధముగ శాస్త్రగ్రంథములను శాసనములను రచించినవారిని గూడ కవులక్రింద జమకట్టిన దిట్టలు, యక్షగానకవుల నుపేక్షించుట విస్మయావహము. త్యాగరాజు వంటివారే యుపే

క్షించ బడినప్పుడు తక్కినవారిమాట చెప్పనేల్ల? కాని ఇటీవల ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు తమ ఆంధ్ర సాహిత్యచరిత్రను సంగ్రహముగ వ్రాయుచును త్యాగయ కావ్యములనుగూడ గ్రహించియుండుట ముదావహము.

కవి విషయము :—

త్యాగయ కృతులనుబట్టి మనకాయనగురించి తెలియ వచ్చు విశేషములు- ఇంటిపేరు, తండ్రిపేరు, నివాసము, గురు నామము మొదలగునవి కొద్దిమాత్రమే. ఇతరాధారములను బట్టి యతని చరిత్రమును దెలుపు గ్రంథములు మనకున్న వానిలో ముఖ్యములైనవి : 1. శ్రీమాన్ విజయూరి వరాహ నరసింహాచార్యులుగారు రచించిన శ్రీ త్యాగరాజ చరిత్ర (ఆంధ్రగ్రంథమాల ప్రచురణ, మదరాసు, 1934). 2 ఆచార్య శ్రీ విస్సా అప్పారావుగారి సంపాదకత్వమున వెలువడిన త్యాగరాజస్వామి శతవార్షికోత్సవ సంచిక (ఆంధ్ర గానకళా పరిషత్తు, రాజమండ్రి). వానినిబట్టి తెలియవచ్చు విశేషము లలో ముఖ్యములైనవి : త్యాగయ యింటిపేరు కాకర్ల వారు, ఈ కాకర్ల వారు ములికినాటి బ్రాహ్మణులు (కాకర్ల వారు నియోగులలోను, వెలనాటి వారిలోను గలరు), భారద్వాజ గోత్రులు. త్యాగయ తండ్రి రామబ్రహ్మము తల్లి శాంతమ్మ (సీతాంబయని వాలాజీపేట చరిత్రలో గలదని త్యా. శ. వా. సంచిక) నివాసము : తంజావూరు మండలములోని తిరువై య్యారు. ఇదే పంచనదమను పుణ్యక్షేత్రము. క్షేత్రస్వామి త్యాగేశ్వరుడు. ఆస్వామి నామధేయమే మన తాగయ్యకుంచ బడి యుండును. త్యాగయ్య జీవితకాలము క్రీ. శ. 1759-1847

త్యాగయ పితామహుని పేరు గిరిరాజబ్రహ్మము. కొందరు పండితులు దేశకాలములు సరిపోవుచున్నవని క్రీ. శ. 1684—1712 సం॥ల నడుమ తంజావూరి నేలిన మహారాష్ట్ర ప్రభువు శహాజీ ఆస్థానాంధ్రకవి గిరిరాజకవియే త్యాగయ తాతగారని అనియున్నారు. కాని ఆ గిరిరాజకవి యింటిపేరు దర్భావారు. (చూ. తంజావూరి సరస్వతీమహలు గ్రంథదీపిక నెం. 3653—కవిగిరి రుక్మాంగదచరిత్ర అవతారిక) త్యాగయ సంగీత గురువుగా ప్రసిద్ధుడైనవాడు సొంఠి వేంకటరమణయ్య. కాని త్యాగయ తన నౌకాచరిత్రమున శ్రీరామకృష్ణ మోదాఖ్యుని పురుషార్థదాయకుడగు తన దేశిక వరునిగా స్మరించియుండెను. అతడు త్యాగయకు తత్త్వోపదేశము చేసిన గురువై యుండును

**గ్రంథ రచన:—**

త్యాగరాజు కాలమున తంజావూరు మండలమున నటురాచనగళ్ళలో నిటుపల్లె పట్టులందును యక్షగాన రచన, ప్రదర్శనలు మిక్కిలిగా సాగుచుండినవి. అతని నివాస గ్రామమున కతి సమీపమునయున్న మెలట్టూరు, శూలమంగలము, ఊత్తుక్కాడు మొదలగు నగ్రహారములలో బ్రాహ్మణ మేళములే వీధిభాగవతము లాడుచున్నవి. రాజాశ్రితులైన శిష్టకవులేకాదు, నారాయణ తీర్థులు, మెలట్టూరు వెంకటరామశాస్త్రి మొదలగు విశిష్టులు నట్టి కృతిరచనకు పూనుకొనియుండిరి త్యాగరాజా సంగతులన్నియు గమనించియే తాను నట్టి రచనకు గమకించి యుండును. అట్టి త్యాగరాజకృతులు మనకు తెలియవచ్చినవి మూడు. 1. సీతారామవిజయము, 2. నౌకాచరిత్రము, 3. ప్రహ్లాద భక్తివిజయము. మూడును

ముద్రితములే. అది మొదలుగా ముద్రితములైననాటి కతని కీర్తనలు ముద్రితములు గాలేదట. సౌకాచరిత్ర మారుతడ వలు ముద్రితమైనది. అయినను ఆ కావ్యములకు తగిన ప్రచారము కలుగకుండుట ఆశ్చర్యావహము. అట్లని యవి గుణ లోపము గలదని తలపరాదు. మూడును చాల చక్కని కృతులు. అవి త్యాగరాజ కృతములు కావేమో యన రాదు. మూడిటిపై త్యాగరాజ ముద్ర ప్రస్ఫుటముగా గలదు. కవి స్వవిషయమును కంఠోక్తిగా గ్రంథస్థ మొనరించినాడు. అయితే ఒక్కమాట, ఆయన యక్షగాన ప్రాయములగు కృతులు వెంకటరామశాస్త్రి కృతులవలె ప్రదర్శనలకెక్కి రాణించినట్లు తెలియవచ్చుటలేదు. కీర్తనలు కేవల గాన యోగ్యములు. అవి ముద్రణభాగ్యము నందుటకు ముందే దాక్షిణాత్యవాగ్గేయకారమూర్తిత్రయ ప్రతిష్ఠలో నతని విశిష్టత గుర్తింపబడినది. అతని కీర్తనలు సమకాలిక శ్లాఘనములకే పాత్రమై యావద్దక్షిణదేశము నట్టూత లూగించినవి. ఆ కీర్తనల కీర్తి ముందీకావ్యములకు రావలసిన ప్రతిష్ఠ మనుగుపడినది.

సీతారామవిజయము వెనుక నెప్పుడో చాలకాలము క్రిందట వాలాజనగర్ లోకనారాయణశాస్త్రుల వారిచే పరిష్కృతమై అచ్చయినదని త్యా. శ. వా. సంచికవలన తెలియవచ్చుసది, అది యిప్పుడు దుర్లభము. (అనేక గ్రంథాలయములందు దాని అచ్చుప్రతులుకాదు సరికదా లిఖిత ప్రతులైన దొరకలేదు. (దానిని చూచునదృష్టము నాకులేకపోయినది. మదరాసు విశ్వవిద్యాలయ సంగీతశాఖాచార్యులు

శ్రీ పి. సాంబమూర్తిగారది కడు హృదయంగమమైన కృతి యని మాత్రము సెలవిచ్చియున్నారు. దాని లిఖిత ప్రతిమధుర సౌరాష్ట్రసభవారియొద్ద దొరకవచ్చునను యాశయున్నది). నౌకాచరిత్రము లిఖితప్రతులు ముఖ్యములగు మన అముద్రిత గ్రంథాలయము లన్నిటగలవు. అసలది యారు తడవలు ముద్రితమైనది. క్రీ. శ 1873లో మంజురపట్టు రామచంద్ర శాస్త్రిగారిచే, 1885లో ఎవరో శేషాచలశాస్త్రిగారిచే, 1892లో జ్యోతిష్మతీ ముద్రణాలయమున వేదము వెంకట రాయశాస్త్రులవారిచే 1930 లో మదరాసు అమెరికన్ డైమండు ప్రెస్సువారిచే, 1949లో మదరాసు సంగీతసభ వారి పక్షమున పి. సాంబమూర్తిగారిచే ప్రచురింపబడినది. ప్రహ్లాద భక్తవిజయము 1868 లోనే విద్వన్మోద తరంగిణీ ముద్రాక్షరశాలలో ముద్రితమైనది. 1949లో మదరాసు ఆది అండుకో వారిచే త్యాగరాజకీర్తనలతోపాటు నౌ. చ., ప్ర. భ. వి॥లు రెండునుకలిసి యొక సంపుటముగా ముద్రింపబడినవి.) ఆ కడమ రెండింటి గురించి మాత్ర మీాదిగువ, త్యాగయ రచనయే ఉపదంశముగా కథావిషయము నుదాహరించుచు గ్రంథస్వరూపము నిరూపించుచు నడుమ నంత మందు కొంత కొంత సమీాక్ష నవధరింతును.

నౌకాచరిత్ర :-

ముందుగా నౌకాకృతి కందమున గణపతి, సరస్వతీ, గురు, సత్కవిస్తుతులు. తరువాత 'కాకర్లాంబుధి చంద్రుడు । శ్రీ కరుడగు త్యాగరాజ చిత్తనివేశా । నౌకా చరిత మొనర్చెద । శ్రీకాంతా చిత్తగింపు శ్రీరఘురామా' అని, అప్పుడే ఫలశ్రుతియు పలికి కథనెత్తుకొనినాడు.

శ్రీకృష్ణుడు వేణుగానముచేయుటతో కథారంభము. చక్కని ఎత్తుగడ. వేణుగానమువిన్న గోపికల మనసుల నేవో మధురస్మృతులు తొందరవెట్టెను. తోడన అందరు నతనిచుట్టు మూగిరి. ఆటలాడిరి. పాటలుబాడిరి. యమునావిహారమునకు బయలుదేరిరి. యమునను తనివిదీర వర్ణించుకొనిరి. నదీతీరమున నొక నౌకనుగాంచిరి కృష్ణుడు పసివాడని యతనిని గట్టుననిడిచి గోపికలు ఎవరికివారే యమునాతీరే యనునట్లు తాముమాత్రమే నౌకావిహారమొనర్ప నూహించిరి. కృష్ణుడు 'పురుషుండులేకనే పూబోణులార, తరుణుల కెప్పుడైన తగదు సాహసము' అనిహెచ్చరించెను. గొల్లభామలు, వల్లె యని యనకుండగనే 'కాముకుండచోట గారాదు కృష్ణ' యని ప్రతిహెచ్చరిక చేసిరి. కృష్ణుడు స్వసామర్థ్య నిరూపణమునకై యొకనెపము గల్పించుకొని "గోవులు వేయైన గొల్ల నేనొకడ"ననెను. గోపికలకు నతనికిని కొంతదూరము సంవాదము సాగినది. ఎట్టకేల కుభయులతో పడవ జరిగినది. గోపికలు 'ఎవ్వరుమనకు సమానమిలలో నింతులార నేడూ... గోకులమున త్యాగరాజనుతుడు మనవలలోన తగిలిపోయె గనుకనూ' అను పంతములాడిరి. గోపికా గర్వభంగమునకై కృష్ణుడు సంకల్పించెను. "గొప్ప సుడిగాలి, బలుమేఘఘోషణములు, వాన, గాఢాంధకారంబు వాడలోన, ద్వారమిటు గల్గి నీకురాదలచెనపుడు'. ఆతుపాను గోపికల 'నున్నతావున నుండనియ్యదు'. వారు కృష్ణుడు కుశలముగా నున్న జాలునని యమునాదేవితో మొరబెట్టుకొనిరి. లాభములేక చివరికి శ్రీకృష్ణునే శరణుజొచ్చిరి. అతడు బాలుని గిల్లి మఱి తొట్ల

నూచినట్లు జాలికనబరచి, 'ఇంతుల నమ్మరాదెంతవారికిని' అని మరల నధిక్షేపించుచు నొక యుపాయము చెప్పెను. ఒడలివలువలెల్లనూడ్చి పడవకన్నము కప్పుడనెను. తనవాంఛిత మగు తద్వస్త్రాపహారము వారిచేతనే చేయింపనెంచిన గడుసెత్తది. అప్పుడు చూడవలె వారి యాక్రోశము. తుదకు జేయునదిలేక, 'వ్యాధులుగలవారు వైద్యునిమాటలు, విశ్వాసములతోను వినిన యట్లు! పూర్ణగర్భిణులైన పొలతులెల్లను మంత్రసాని చెప్పినమాట సల్పినట్లు' కుబుసమూడ్చిన నాగువులవలె నగ్నికలై, మూన మొకవంక బుసకొట్టుచుండ నతని కట్టెదుట నిలచిరి. వాన వెలిసినది. ఓడ యొడ్డు బట్టినది. గోపికలు బ్రదికి బట్టగట్టిరి. తదుపరి వారు సింగారించుకొని వచ్చి శ్రీకృష్ణునకు మంగళహారతి పట్టుటతో గ్రంథము ముగిసినది.

గోపికా వస్త్రాపహరణ కథారంగము మారినది, నిమిత్తమును గొత్తది నాయకునకు వస్త్రాపహరణ దోషము తగుల కుండగనే సంకల్పసిద్ధియైనది, అదియొక ఔచిత్యము. గోపికల కిష్టములేకున్నను గోకలు విడచుట తప్పనిసరియైనది. అదియొక చమత్కారము. మార్పు మనోజ్ఞము. కొందరిట్టి భగవత్పరములగు శృంగారకృతుల కాధ్యాత్మికార్థము ప్రతిపాదించుట యొక పరిపాటి. మన స్తత్త్వ శాస్త్రసూత్రములచే కవిహృదయమున నేదో మణగియున్న మర్మ మున్నదనుట నవభావుకదృష్టి సహృదయ మాత్రునకు కావలసినది కవిత్వపదార్థము. అది సమృద్ధిగనున్న జాలా పరిపాటి బాటింప నక్కరలేదు, ఆదృష్టి సారింప నవసరములేదు. త్యాగరాయ

కృతిలో కావ్యత్వము సమృద్ధిగనున్నది. ఇందు పల్లవి, అను పల్లవి చరణముల వింగడింపుతో కవినామాంకిత ముద్రలతో ప్రసిద్ధ రాగతాళములలో చక్కని కృతులు, అలతి యలతి సంధి వచనప్రాయములైన గద్యపంక్తులు దరచు ద్విపదలు, అక్కడక్కడ పద్యములుగల వందులో శార్దూలములవాడక మెక్కువ. అటనట చిటిపొటి నెరసులున్నను మిగుల సరసమై నది రచన త్యాగయ దీనిని ప్రదర్శన కుద్దేశించి యుండడను కొందును.

ప్రహ్లాద భక్తివిజయము

వరుసగా నేడు కందములలో శ్రీరామ విష్వక్సేన వాణీనారద తులసీదాస, పురందరదాస, భద్రాచల రామ దాసుల స్తుతులు-తరువాత నొక వచనమున పాండురంగ నామదేవ జ్ఞానదేవ, సహదేవ జయదేవ తుకారామ శ్రీనారా యణ తీర్థాది పూర్వ మహాభక్తులకు నమస్కార సమర్ప ణము-శ్రీరామునకు కృతిసమర్పణము-కవి స్వవిషయము క్వాచిత్కము-ఒకద్విపదలో కథాసంగ్రహము, ఫలశ్రుతి.

గ్రంథ మైదంకములుగ విభాగింపబడినది

'శ్రీ గణేసులు రావడము,' అతడు 'దిత్తళంగుమని వెడలి' నాడట. తరవాత 'దౌవారికుడు రావడము- బాగు మీరనటనము సేయుచును, రాగతాళ గతులను బాడుచును' వాని వాలకమొక దరువులో వర్ణింపబడినది. అది అచ్చు మచ్చు తంజావూరు యక్షగానములందు వర్ణింపబడిన కటికము వాని వాలకమే. వాడు వచ్చి 'నాటక మొనరించు సూత్ర ధారునింగని యీ సభయేమి, యీ దివిటీల ప్రభలేమి, యీ

మృదంగాది వాద్యఘోషము లేమి యీ సొగసైన వేషము లేమి...' అని పృచ్ఛించును. సూత్రధారుడు చైత్రోత్సవ సందర్భమున త్యాగరాజకృతము ప్ర. భ. వి. నాటకము నాడ సభవారాన తిచ్చినట్లు చెప్పును ద్వారికుడు, ప్రహ్లాదుని హిరణ్యకశిపు డురగపాశబద్ధుని జేసి సముద్రమున ద్రోయించె ననియు, అతడు హరిభక్తుడగుట సముద్రుడతని నాదరించి, నగరాలంకరణము చేయ తన్నాజ్ఞాపింప దానందులకే వచ్చి నట్లును చెప్పినాడు.

ఒక దరువులో సాగరుని రాక చెప్పబడుటతో నాటక కథారంభమగును. అతడు గరుడావాహన మొనర్చి ప్రహ్లాదును రగపాశవిముక్తు నొనర్చును 'హరి యెట్లో నాకు నీవు నాలాగు సుమీ హరిభక్తుల నర్చింపని నరజన్మంబిలకు మోపు నాలుగు దిశలన్, అని పలుకరించి పరవశుడై యున్న ప్రహ్లాదునకు బాహ్యబోధము కలిగించి, 'వచ్చెను హరి నిన్ను జూడవచ్చెను, నిన్నుజూచి మెచ్చెను' అని అభయమిచ్చెను. ఇది ప్రథమాంకము.

ప్రహ్లాదుడు ప్రసన్నుడై 'ఈశుగనలేని జన్మంబు- యిలకు మోపు' అనియు, 'నా జయముజూచి నమ్మరే దేవుని' అనియు పనవి పనవి పలవించును. నారదుడప్పుడే సనకాది మునులకు ప్రహ్లాదు మహిమ నుపన్యసించి 'హరి గుణ మహిమానంద జలధిలో వల్లకి యను తెప్పనుబట్టి యీదుచు' ప్రహ్లాదుని జేరవచ్చెను. అతని వీణావాదననాదము వినగానే ప్రహ్లాదున కొక స్పృహకలిగి, 'నిజమైతే నా ముందర నిలువు మీ వేళ...నా భక్తియె నిజమైతే' అని యీ విధముగా వరదు నుద్దేశించి నిక్కచ్చిగా వక్కాణించును.

నారదుడు 'నారాయణ నామములను పారాయణ మొనరించుచు ... అతిత్వరితముగా ... జయము జయ' మనుచు సమీపించును. ప్రహ్లాదు డతనిని స్తుతించును. నారదుడు 'నీవంటి భక్తుని నిఖిలలోకముల నేవంకగాన'నని ప్రశంసించి వైకుంఠవర్ణనచేసి యచ్చటి ముచ్చట చెప్పబోవుచుండగా ప్రహ్లాదుడే అందుకొని ఆతురతతో లక్ష్మీనారాయణుల కడ తన యుబుసేమైన వచ్చినదా యని యడుగును. నారదుడట ప్రహ్లాదుని గురించి వారికి జరిగిన సంవాదము వివరించును. నారాయణుడు 'వాని భక్తిచే, వెలబడిపోతి నామనసు వేఱొక టెంచదు- ఏమిసేయ నీవలె నను బాయలేడు కని వచ్చెదనంచును బైలుదేఱంగన్'— హరి వినుటట్లు తన్నతడు తొలినాటి రేయి లక్ష్మీభక్తుని గురించిన యోజనతో 'పడతిరో సొగసెల్లఁ బానుపూపాలు బడజేసె' నని చెలికత్తెతో చెప్పుకొన్నదట. అట నొక సీసమున ల॥ నా॥ లకు పాదపాద సంవాద ముదాహరింపబడినది. అందు లక్ష్మీదేవి ఆక్షేపణ : "తెలవార ప్రొద్దుగూకులు మీకు నిజదాస వెట్టి యేలనో పనుల్ వేఱలేవె" అని త॥ ఇక హరిలక్ష్మికి నమ్మిక బల్కరానున్నాడు, 'బాలక నీ భాగ్యమెల్ల పండామెనురా' అని నారదు డభయమిచ్చును. ఇది ద్వితీయాంకము.

హరిబాడగానని ప్రహ్లాదునావేదన అంతు పట్టరాకుండెను. ఆసందర్భమున త్యాగయరచనలో పోతనగారి పోకడలు స్ఫురించినవి.

ఉదా : 'ఎన్నగ మనసుకురాని -
పన్నగశాయి సొగసు,

పన్నుగ కనుగొనని కన్నులేలే ।
కన్నులేలే-కంటి మిన్నులేలే ।'

(చూ. 'కంజాక్షునకు గాని కాయంబు కాయమే' మొ॥ భాగవత పద్యము) ప్రహ్లాదుడును గజేంద్రునివలె 'కలఁడో లేఁడో' అని ఆక్రోశించి మూర్ఛితు డగును. ఆసమయమున 'అల వైకుంఠపురంబులో' నన్నట్లు-'పొంగారు జలధిలోఁబొందుగా నడుమ, బంగారు చవికెలో భాగుగానుండు । శృంగార లక్ష్మిని శ్రీహరి మఱచి । ('సిరికిం జెప్పడు'-భాగ॥) 'రంగైన వస్త్రంబు రాపాడగాను' ('వివాద ప్రోత్థిత శ్రీకుచోపరిచేలాంచలమైనఁ వీడడు' భాగ॥) ।...హరి బయలుదేరును. హరి రాకకు ప్రహ్లాదు డాశ్చర్య మొకవంక హర్షంబు నొకవంకఁ । గడు భయంబొకవంక' గల్గగా తొలుత నదియొక స్వప్నభ్రాంతియేమో అనుకొని పిదప 'ఇదిగో శ్రీహరి, వారిధి యిదిగో...స్వప్నము గాదిది' అని నిశ్చయించుకొని, 'దగ్గున లేచి, ఏనాటి నోముఫలమో-ఏ దానబలమో' అనియనుకొని హరిస్తుతిలో పరవశుడగును. ఇది తృతీయాంకము.

శ్రీహరి ప్రహ్లాదుని 'చిత్తశుద్ధి లోకులకు దెలియ జేయుటకై' అతనితో వాదులాడదలచును-'అరసిక సంభాషణతో రసికజనేషు వాక్కలహం శ్రేయః' అని హరి ప్రహ్లాదుని వలసిన సంపదలిస్తును వరమడుగు మనును. హరిభక్తి వినా అన్యపదార్థసామ స్త్య విముఖుడగు ప్రహ్లాదునకది సూటిపోటీ మాటవలె దోచినది. తోడనే 'ఆనాటి దాహమెల్లను నేనార్చగ నిన్నుజూచి నేర్చిన మదిలో బానకపు బుల్లరీతిని, హీనంబగువార్తనిది సమయంబా' అని హరినే యాక్షేపిం

చును. తాను కల్పతరువునుజూచి కట్టెపుల్లలడుగు మూఢుడ గానని, 'ననుబ్రోవకనువిడువను రా రామ' (అప్పటికిరామావ తార మెక్కడ? అయినను అచట నా ప్రహ్లాద పాత్ర గొంతుతో పలుకుచున్నది త్యాగయ్యయే. అతనికాభక్తిపార వశ్యమున పెదవి మెదిపిన రామ నామమే వచ్చును), 'సిగ్గు పోవువేళ చీరలిచ్చినరీతి' (ఇది త్యాగయ తన నౌకా చరిత మును స్మరించుట కాబోలు) దొరికితివనును. ప్రహ్లాదుని మోహా పెట్టదలచిన హరి 'ననుజూచి లబ్బమే! మాటొను - యేది యేదనగ మర్త్యులు, లేదననీవు, నవ్వారా? చాయగు కీర్తి గాదు - మనసారగ నిత్తువరంబు లందుకో' అని బలివలె సంప దల పట్టిక నేకరువుపెట్టును. ప్రహ్లాదుడు 'పామరులకు బలు కుము మఱి సామర్థ్యములెల్ల ... నా మనసుకు సొమ్ము నీవు నలిన దళాక్షా, వారిజ నయన నీవాడను నేను' అని— 'తన లోనేధ్యానించి— తన్మయమే కావలెరా, తన గుహలో దానుండెడు తావును తెలియఁగవలెరా ... మ్రింగిన కళ్ళకు రుచుల మేలు గనేవారెవరు—' ఈవిధముగ తన తత్త్వ స్పృహను (యిట నిది త్యాగయ్యదేయని వేరే చెప్పనక్కర లేదు) వెల్లడించును. హరి యింకను దనపట్టు వీడలేదు. ప్రహ్లాదుడు 'పెద్దలైనవారియొద్దనే సత్యముకద్దని నమ్మితిని - సత్యసంధుడ ననుకొంటిని' అనును. 'నీపదయుగముల దడ సేయక కట్టివేతు దాళను నేనున్'అని, 'నాలోని జాలి నీకేల తోఁచదురా, మనసిచ్చి నాతోను మాటాడునదెపుడు' అని నిలదీసి యడుగును. తరువాత 'తనలోతానే స్వరూపమెఱింగి యపరోక్ష సాక్షాత్కారమైనందున నజ్ఞానజనితమైన జాలినిక

జెందనేల' యని ధైర్యమవలంబించి, 'వెన్నయుండగ నేతి వెసనంబు వడనేల' యని యనుకొనును. హరి సరే నీయిష్టమే కానిమ్మనగా 'వద్దనుండుననదే బహుమేలు వారిజాక్ష' అని అట్లు చేసినచో దాను 'బంగారు పూల బూజింతు ... సంగీతము వినుపింతు — సారెకు నే సంతోషింతు' ననును. మరియు నా వెంటనే 'తీరునా నాలోని దుగ్ధసారమా నీ పాదసారసము నాదు హృద-యారవిందమున బెట్టి కట్టుకోక॥ తీరునా॥' అని యనిపించుటలో ప్రహ్లాదుని సాత్త్విక భక్తి భావ తీవ్రతను పరాకోటి ముట్టించినాడు కవి. హరి నుండి ప్రహ్లాదుడు పరిచారక భక్తిస్థితి నపేక్షించును. అదియే శేష శేషిభావ సేవాభిలాషము. హరి 'సరిసమానము నిన్నుసల్పంగ బూనిన బరిచారకము సేయు బ్రతుకదేల' యనును. ప్రహ్లాదుడు 'దయరాని దయరాని దాశరథీ రామ...తలచితే మేనెల్ల బులకరించెను రామ' అని 'ఈలాగున స్వానుభవంబు దెలిపి, (అవును. అది త్యాగయ్య అనుభవమే), 'నాలోని జాలిదెలిసియు, నీలాగున పరీక్ష సేయ నీలా మేలా' అనును. చివరకు 'వలచుచు నేనొక్క వరమడిగెదయ్యా' అని అలనాటి కల్యాణవేళ ఆతురపడు సీతాహృదయ మనుభవించిన సుఖము 'దయసేయవయ్యా సదయ రామచంద్ర' అనుచు ఆ యడుగుటలో నేదో నిర్భరభావ మాధుర్యముతోచి పరవశుడై హరిపదములపై వ్రాలిపోవును ప్రహ్లాదుడు. (ఇట కవియు వివశుడైనట్లు తోచును.) హరి ప్రసన్నుడై యతని నంకమున పొదివిపట్టును. ప్రహ్లాదు డానందమగ్నమానసుడై స్వామికి మంగళము పాడును. ఇది చతుర్థాంకము.

హరి 'పాలసాగరమందుఁ బవ్వళించుటకన్న ... అల వికుంఠమునందు నాది లక్ష్మియుకన్న భక్తుని హృదయంబు బాగనుండు ... అట్టి నీ చిత్తవేదిలో ననిశముందు, (కాని), నిన్న మా కాంతపై నాస నిల్పినాను వచ్చి ప్రొద్దాయె మఱల నేవత్తుఁగాని, జాలిబడవద్దననుగానఁ జాలలేక' యనును. ప్రహ్లాదు డామాటలు 'వీనులఁ జురుక్కునంగా, దీనత తన మదికిఁ దోఁచి దిగ్గున లేచెన్' లేచి 'నన్ను విడిచి కదలకురా- రామయ్య వదలకురా- నిన్నుబాసి యరనిముస మోర్వనురా' అని యాక్రోశించును. హరి పోక తప్పదనును. అయితే అందుండక వేగవచ్చెదనని నాపై నానబెట్టిపోరా' అని బతిమాలును ప్రహ్లాదుడు. 'ఆలాగు గాని వచ్చెద'నని హరి యరుగును. ప్రహ్లాదునకు మరల వ్యసన మారంభమగును. ఈసారి హరి లక్ష్మీసమేతముగా ప్రత్యక్షమగును. అతని వెనుక బ్రహ్మేంద్రాదులును వత్తురు. ప్రహ్లాదుడు హరిని షోడశోపచారములం బూజించి మంగళము పాడును. అది 'నినామరూపములకు నిత్యజయమంగళం' అను ప్రసిద్ధమైన త్యాగరాయకృతి. తరువాత నొకదరువున సూర్యోదయప్రశంస. మరల నొక మంగళకృతి- 'జయమంగళం నిత్య శుభమంగళం' అని ఫలశ్రుతి. ఇది పంచమాంకము. గ్రంథాంతము.

ఇందలి వస్తువు ప్రహ్లాదుని కథ. కాని యిందు హిరణ్యకశిపుడు, లీలావతి, చండామార్కులు మొదలగువారి పాత్రలకు ప్రసక్తి లేదు. చివరికి నరసింహమూర్తి యవతారము ప్రసక్తియు లేదు. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని బాధపెట్టిన

విషయము మాత్రము గ్రంథాదినించుక చెప్పబడినది. అంతే అసలు గ్రంథము గ్రంథమంతయు ప్రహ్లాదుని హరి విరహావేదన, భక్తిభావావేశము, కృతార్థతమాత్రమే యితివృత్తముగా సాగినది. ప్రహ్లాదచరిత్ర నీరీతిగా పాత్రైక ప్రధానముగా, బాహిర సన్నివేశముకంటె పాత్రయొక్క ఆంతర ప్రవృత్తి తత్త్వోన్మీలనము ప్రధానముగా నిదివర కెవరును రచించియుండలేదు. త్యాగయ విశిష్టదృష్టి యిందు విస్ఫుటముగా గన్పట్టును.

ఇందు కరుణరస మంగప్రాయమైనది కాని ప్రధానమైనదేదియని ప్రశ్నవచ్చునపుడు భక్తియని కంఠోక్తిగా జెప్పవచ్చును. భక్తిప్రసిద్ధమగు నవరస పరిగణనమున కెక్కలేదు. కాని యది భావమాత్రముగా కొట్టిపారవేయదగినది కాదు. ఏత్యాగరాజువంటి సమర్థుడో కావ్యరచనకు గడంగవలెగాని అది కడువేగముగా రసస్థితి నందగలదు. అసలు రూపగోస్వామి, మధుసూదన సరస్వతి ప్రభృతులైన ఆలంకారికులు కొందరు భక్తినిరసముగా పరిగణించినవారు లేకపోలేదు. వారి రసరాద్ధాంతమున కీ ప్ర. భ. వి. ఒక రమ్యోదాహరణము. త్యాగయకృతిలో నిరూపింపబడిన ఆభక్తితత్త్వమున కెంతశక్తియున్నదనగా స్వతః సహృదయుడైనచో భగవద్విశ్వాసము లేకయున్న పాఠకుని విషయమునగూడ చదువునంత హృదయమును బొదివిపట్టు శక్తిగలదు. త్యాగరాయలు గాయకులలో నెంతఘనుడో భక్తులలో నంతయుత్తముడు. అసలు సంగీత సాహిత్యములకువలె, భక్తిశృంగారములకువలె భక్తికిని సంగీతమునకుగూడ నేదో దివ్యబాంధ

వ్యమున్నది. పురందరదాసు, తులసీదాసు, తుకారాము, మన అన్నమయ క్షేత్రయ నారాయణతీర్థులు మొదలగు మహాభక్తులెందరో సంగీత భంగీతరంగిత హృదయులు, త్యాగయ పురందరదాసాది పూర్వభక్త కవిబృందమును దలచుకొని పులకించినాడు. ఆభక్తిలోను అతడు ప్రహ్లాదునివలె ప్రసన్నుడు. ఆ ప్రపత్తిసనాథమైన భక్తి భావతీవ్రతయే యీకృతికి జీవగఱ్ఱ. పరమభాగవతులలో ప్రపత్తికి ప్రహ్లాదుని చరిత్రము పరమోదాహరణము. ఆప్రహ్లాదచరిత్రము నతిమాత్ర మనోజ్ఞముగా రచించిన ప్రథమాంధ్ర మహాకవి భాగవత కర్త, బమ్మెరపోతన. పోతరాజు పోకడలు కొన్ని త్యాగరాజునకు తప్పనిసరియైనవి. పురందరదాస నారాయణతీర్థుల పోకడలును త్యాగయకృతులలో (అంటే యిచట నతని కీర్తనలలోనని) గలవని అభియుక్తుల యభిప్రాయము.

త్యాగరాజు గ్రంథప్రారంభమున దీనిని ప్రబంధమని పేర్కొనియున్నను తత్రాపి పలుతడవలు నాటకమనియే వక్కాణించెను. ఇది 'రాగతాళ మృదంగ రవళిచే మిగుల నాగరికం బభినయముచే జెలగు. భక్తాగ్రగణ్యుడై పరగు ప్రహ్లాద భక్తవిజయంబన బాగైనకృతి' యని ముందుగనే చెప్పియున్నాడు; గ్రంథారంభమునందలి యిష్టదేవతాభివందనాదికమే నాంది, దౌవారిక సూత్రధారుల ప్రసంగమే ప్రస్తావన, ఫలశ్రుతియే భరతవాక్యము ననుకొన్నచో, అదికాక విశేషముగ నంకవిభాగము నున్నదికాన దీననాటకలక్షణము కొంత పట్టినదనవచ్చును. అయితే అది మార్గనాటక పరిభావము మాత్రమేకాని నిక్కచ్చిగా ఆశక్కి కుపలక్ష్యభూతము

గాదు. నాటి తంజావూరి యక్షగాన నాటకప్రబాణీ యట్టిదే. ఆకవులు తమ య॥ గా॥ లను నాటకములనియే వ్యవహరించిరి. ఇందలి గణపతి ప్రార్థన మాత్రమే కాక పాత్రప్రవేశము, దౌవారికుని కటికము వానివంటి వాలకము, పాత్రప్రవేశ సందర్భములందు తెరవెడలు దరువులవంటి పాత్రప్రశంసాత్మక కీర్తనలు మొదలగునవి ఆనాటి తంజావూరి యక్షగానములలో గన్పట్టును. అంకవిభాగముగూడ శహాజీ ప్రభృతుల యక్షగాన కృతులందు కొన్నిట గన్పట్టును గాని యది యక్షగానములకు సహజమైనది కాదు. అందు ప్రదర్శన సౌలభ్యమును గలదుకాని తరచు సంధివచనముల నాశ్రయించు యక్షగానముల కా యవసరము లేదు. ఇక ప్రకృతము త్యాగయ్య నాటకమున నా యంకవిభాగము సంధ్యంగోచితముగా లేదు. అసలర్థప్రకృతులకు కార్యావస్థలకు అనుసంధానమే కుదరలేదు, కుదురుట కవకాశమే లేని యితివృత్తమది. కాని యిందలి లక్ష్మీనారాయణ సంవాద విషయమున నారదాఖ్యానముగా గాక ప్రత్యేకము దానికొక అంకమున ప్రవర్తింప జేయువలసినది, ఈనాటకము త్యాగయచే ప్రదర్శనోద్దిష్టమైనదని విశదమైనది, సంవాద ప్రచురమైనదే, కాని సన్నివేశబలముచాలమి ప్రదర్శనమున రక్తిగట్టదు. అందును ఇది ఆత్మాశ్రియ ఫక్కికమగు కావ్యము. నాటకమన్నది పరాశ్రియ ఫక్కికమైననే గాని ప్రదర్శనమున దానికి రాణింపు ఉండదు. కాని త్యాగయ కృతి చదువుకొన్న జాలు తనిసిపోదుము.

ఇందలి రచనా విశేషములు : కందములు, సీసములు, ద్విపదలు, వృత్తములు, వచనములు, దరువులును గలవు.

దరువులను దరువులనుటకంటె కృతులనుట లెస్స. ప్రతికృతి యందు పల్లవి, అనుపల్లవి, చరణములు సలక్షణముగా నున్నవి. ఇందట్టివి 45 గలవు, అన్నియు ప్రసిద్ధరాగతాళము లలో, త్యాగయ ముద్రలతో నున్నవి. కందములు పడక, సీస ద్విపదలయందు ప్రతిపాద సమతాపాదనము చక్కగా నున్నవి. సంస్కృతశ్లోకములు నొక చూర్ణికయు, తెలుగున నొక దండ కమును గలవు.

కావ్యమెట్లు భక్తి ప్రపన్నతామయమో, రచన యట్లు ప్రసన్నతా సంపన్నమైనది. తప్పొ యొప్పొ ఎక్కడను తడ బాటులేని పదప్రయోగములా ప్రయోగములను తరుముకొని వచ్చు నొక భావావేగము. అలతి యలతి అతి సాధారణ పదములేగాని యవి యొక ఆవేశములో నవతరించి అపూర్వ భావ శబలితములైనవి. ఉదా॥ కొన్ని పలుకుబడులు, నానుడులు: దుగ్ధ (కౌతుకము) సరిసమానము, ప్రొద్దుగూకులు, దెబగుబలుగ, వెన్నవంటి మనసు, గొబ్బున దెలియగ, గడి దేరి; సద్దన్నపుమీఁది వెన్నచందురుడవునే, తన్నుదా దెలిసిన రీత్వమేల, ఆడబోయిన తీర్థ మెదురైన రీతి, సిగ్గుబోవువేళ చీరలబ్బినరీతి మొ॥ ఆ యావేశములో దొరలిన పొరబాటులు ననేకమున్నవి. 1. సీస ద్విపదలందింద్రగణ స్థానమున పంచ మాత్రిల వైనము పాటించి చంద్రగణములనుగూడ ప్రయో గించుట:- ఉదా॥ 'భక్త విజయంబన బాగైనకృతిని;' 2. సంధి దోషములు : తల్లుండ (తల్లి + ఉండ = తల్లియుండ), మాన వాలకించి, హరిమయము నెంచి, భక్తు లంకమునందు (ఇట షష్ఠియందు), సంబుద్ధికిగూడ సంధి— 'వారణశరణా కర్ణిం

వుము (ఇది అచ్చు పొరబాటుకాదు, సవరించిన ఛందోభంగ మగును). 3. చరణకౌగిలి, దాస వెట్టి, బహుమేలు మొ॥ వైరిపదములు. ప్రసిద్ధములగు వైరిపదములు కొన్ని వ్యాకరణ ప్రకారము సాధువులైన సామాన్య పదములకంటె శక్తిమంతములైనవే, సందర్భ శుద్ధిని బట్టి తప్పక ప్రయోగింపదగినవే కాని కృతకములు ప్రయోజన రహితములు. పై వానిలో బహుమేలు మాత్రమే ప్రసిద్ధమైనది. ఇట్టి ఛందో వ్యాకరణాతిచారములు, అంక విభాగము నందలి ఔచిత్యరాహిత్యము, అవతారక్రమ పరిజ్ఞానము నెడ అనవధానత నిజముగా దోషములే. కావనలేము కాని అవియొక ఆవేశములో దొర్లికొని వచ్చినవి. త్యాగయ 'తరహా' మహాకవుల యెడ నిట్టిదేమంత అక్షంతవ్యములగు దోషములు గావు. అది కాక మన వాఙ్మయమున ఆద్యంతము పఠితృహృదయమును స్పందింపజేసి రసపరవశ మొనర్చు నిట్టికృతు లపురూపము. ఇది దక్షిణాంధ్రయుగమున తప్పబుట్టిన సత్కావ్యము.

త్యాగయ పుట్టుక తమిళనాడు నడిబొడ్డున అతడాంధ్రుడయ్యు నెందరో అరవల కిలవేల్పు వంటివాడు. మన త్యాగయ్య గొప్పతనము నూచ ముట్టుగా గ్రహించుటలో మనమే వెనుకబడి యుంటిమేమో యనిపించును.

---

# మెలట్టూరారు భాగవతమేళ నాటకములు

ఆంధ్రుల నాట్యకళాప్రతిష్ఠ కధిష్ఠానము కూచిపూడి. అరవలకు మెలట్టూ రట్టిది. ఉభయత్రి ఆ కళాసంప్రదాయములు చాలకాలమునుండి శాస్త్రీయముగను అనూచానముగను బ్రాహ్మణ భాగవతుల మేళములవలన అభివృద్ధినందుచు వచ్చినవి. కాని ఈనాడు మన కూచిపూడిలో కొలది మంది పెద్దలయొద్ద సంప్రదాయజ్ఞానము మాత్రమే మిగిలియున్నది. ప్రదర్శనప్రతిష్ఠ లడుగంటినవి. మెలట్టూరులో నేటికి నేటేట నృసింహజయంతినాఁడనగా వైశాఖ శుక్ల చతుర్దశినాఁడు ప్రదర్శనములు సంప్రదాయబద్ధముగా పెద్ద పెద్దలచేత జరుపబడుచున్నవి.

విజయనగర సామ్రాజ్య ముచ్ఛ్రదశలో నున్నప్పుడే రాయసమ్రాడ్విధేయులగు నాయక రాజుల యాజమాన్యమున దక్షిణదేశమున ఆంధ్రప్రభుత నెలకొన్నది. తల్లికోటయుద్ధమైనతరువాత నంతవరకు రాయసామ్రాజ్యము నాశ్రయించియుండిన ఆంధ్రకవులు, పండితులు నితర కళాజీవులును కుటుంబములకు కుటుంబములుగా రాజాశ్రయ మపేక్షించి దక్షిణాంధ్ర సంస్థానములకు వలసలుదీసిరి. బ్రాహ్మణపండితులు రాజులను మెప్పించి అగ్రహారములను బొందిరి. అట్లు వెలసినదే మెలట్టూరు. అది తంజావూరికి సుమారు రామడదూరములో నున్నది తంజావూరి ఆంధ్రనాయక రాజగు అచ్యుతప్ప నాయకుని రాజ్యకాలమున (క్రీ॥శ॥ 1561-1614) అది యతని పేర బ్రాహ్మణాగ్రహారముగా నొనర్పబడినది.

అచ్యుతప్ప నాయకుని తరువాత తంజావూరి ప్రభువులు, రసికులు, గీతిసాహిత్యప్రియులు నగు రఘునాథ విజయ రాఘవనాయకుల కాలమునను, అటుపిమ్మట మహారాష్ట్ర ప్రభువుల కాలమునను, ఆ తంజావూరిలోనే కాక మధుర, మైసూరు పుదుకోట మొదలగు సంస్థానములలోను అసలానాడు దక్షిణదేశములో నెటుచూచినను యక్షగానముల రూపమున కోటలో పేటలో ఆంధ్రసరస్వతి ప్రతిష్ఠ నృత్యము చేయుచుండినది. కాని యక్షగానముల రచన మాత్రమే బ్రాహ్మణకవులు చేయుచుండిరి. ప్రదర్శన ప్రతిష్ఠలు రాజాస్థానములనుండి రచ్చసావళ్ళవరకు భోగమువారు మొదలగు జాతులవారిపరమై యుండినవి. ఆదినములలో నచటి యగ్రహారములందు స్థిరపడిన ఆంధ్రబ్రాహ్మణ పండితులు కొందరు, భరత విద్యాధురంధరులు, అందులో కూచిపూడి ప్రాంతముల నుండి లేచివచ్చినవారును కొందరుండిన నుండవచ్చును. వారు అచటి యరవసోదరులను కూడగట్టుకొని శిష్టతా పరిపుష్టముగను సంప్రదాయబద్ధముగను నాట్యకళ నుద్ధరించుటకు పూనుకొనినట్లు తోచును. తత్ప్రయత్న ఫలితమే మెలట్టూరు భాగవత మేళ నాటకములు—అనగా భక్తులైనవారుకొందరు కూడి ప్రదర్శించు నాటకము లని యర్థము. కూచిపూడివాని వలె నివి నృత్యరూపకములు (Dance-dramas.)

మెలట్టూరికి మెరట్టూ రనియు వ్యవహార మున్నది. దాని అసలు స్వరూపము అరవములో నయితే మిళత్తూరై 'యుండుననియు' తెలుగులో నయితే మేలపుటూరై, మెలట్టూరై యుండవచ్చు ననియు ఆచార్య శ్రీ గంటి జోగిసోమ

యాజిగారును, ఆచార్య శ్రీ విస్సా అప్పారావుగారును సెల విచ్చియున్నారు. చక్కగా కుదిరియున్నది వారివక్కణ. ఐతే మెలట్టూరిలోని యిటీవలి ప్రదర్శన ప్రతిష్ఠలు మాత్రమే తమిళసోదరులవి కాని వారు ప్రదర్శించు నాటకముల గ్రంథములును, తత్సంబంధములైన కళాసంప్రదాయములును మన వారివి. ఇది మన ఆంధ్రులెంతో అబ్బురపడ వలసిన సంగతి. అరవదేశపు లోగిట యీనాటికిని ఆంధ్రసరస్వతి గజ్జెకట్టివారి ఆదరాభిమానములు చూరగొనుచున్న దనిన మన మెంత అబ్బురపడవలెను మరి !

మెలట్టూరు వెంకటరామశాస్త్రి:—

భామకలాపాదుల విషయమున కూచిపూడివారికి కుల పతి సిద్ధేంద్రయోగి. భాగవతమేళ నాటకముల విషయమున మెలట్టూరువారికి వేంకటరామశాస్త్రి యట్టివాడు. ఈయన వెలనాటి తెలుగు బ్రాహ్మణుడు. ఇంటిపేరు తెలియదు. మెల ట్టూరు వెంకటరామశాస్త్రి యని వ్యవహరించుటే పరిపాటి యైనది. ఈయన శ్రీవత్ససగోత్రుడు, గోపాలకృష్ణార్యుని పుత్రుడు, లక్ష్మణార్యుని శిష్యుడు, దేవీ నృసింహోపాసన ములు గలిగిన మహాభక్తుడు, నాట్య సంగీత సాహిత్య విద్యా విశారదుడు నని యాతని గ్రంథముల వలనను, స్థలజ్ఞులగు పెద్దలవలన, తంజావూరు మండలము కుంభకోణముతాలూకా పాపనాశము సమీపముననున్న అన్నికుడి గ్రామమునందలి ఆయన బంధువర్గమువారి వలనను కొంతకొంత విషయము తెలియవచ్చినది. మరియు నితడు తన వార్ధకమున త్యాగ రాజునకు సమకాలికుడైనట్లు శ్రీ పి. సాంబమూర్తి, డాక్టరు

శ్రీ వి. రాఘవన్ మొదలగు తమిళదేశపు పండితు లనేకులను చున్నారు త్యాగరాజుకాలము[1] క్రీ॥ శ॥ 1759—1847 అనగా వెంకటరామశాస్త్రి పదునెనిమిదవ శతాబ్ది నడిమి భాగముననను చివరను గూడ నుండియుండవచ్చునని యూహింపనగును.[2] త్యాగరాజు నివాసమగు తిరువారూరు మెలట్టూరికి సమీపమున నున్నది. అతడు వేంకటరామశాస్త్రి నాటకములను జాల మెచ్చుకొనినాడట. తాను నించుమించట్టి రచన లొక మూడు చేసినాడు. త్యాగరాజ వేంకటరామశాస్త్రుల కృతులకంటె ముందే మెలట్టూరిలో నే యొక తెలుగు దృశ్యప్రబంధము వెలసినది. అది క్రీ॥ శ॥ 1700 ప్రాంతము[3] వాడును తొలుత గోదావరీ మండలమందలి కూచిమంచి అగ్రహార వాస్తవ్యుడును పిదప దక్షిణదేశమునకు జరిగినవాడును శ్రీకృష్ణ లీలాతరంగిణీ రచనావిశ్రుతుడు నగు శ్రీ నారాయణతీర్థులు రచించిన పారిజాతాపహరణము.[4]

---

1. చూ. వింజమూరి నరసింహాచార్యులవారి శ్రీ త్యాగరాజచరిత్ర, ఆంధ్ర గ్రంథమాల ప్రచురణ, మదరాసు, 1934.

2. 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని'ని బట్టి ఇతని కాల మింకను వెనుకకు బోవును. అందు శ్రీ సుబ్బరామ దీక్షితారుగా రితడు తంజావూరి మహారాష్ట్ర ప్రభువులు శరభోజి, శివాజీల కాలమున నుండినట్లు చెప్పినారు. ఆ రాజుల రాజ్యకాలములు వరుసగా క్రీ॥ శ॥ 1798-1833; 1833-55. దీనినిబట్టి వెం. రా. శాస్త్రి 19 వ శతాబ్ది పూర్వార్ధమునను నుండినట్లు చెప్పవలెను.

3. చూ. **History of Classical Sanskrit Literature by Dr. M. Krishnamacharya.**

4. మెరట్టూరు బాలసుబ్రహ్మణ్యశాస్త్రిగారికడ నొక ప్రతి గలదట. తంజావూరు సరస్వతీ మహాలులో నొకప్రతి గలదు. కేటలాగు నం. 544.

పై ముప్వురి రచనములు నుద్దిష్టరూపక ప్రయోజనములు. అందు కొన్ని నాటకములనియు వ్యవహరింపబడినవి. వేంకట రామశాస్త్రి కృతులన్నియు నాటకములని యతనిచేత నే వక్కాణింపబడినవి. వానికి దశరూపక ప్రభేదమగు నాట కము లక్షణము పట్టదు. అట నాటకశబ్దము రూపక సామాన్య వాచి. నాటి తంజావూరు యక్షగానములు నట్లే వ్యవహరింప బడినవి. తీర్థప్రభృతులకృతులు రచనా ప్రక్రియనుబట్టి యక్షగాన ప్రాయములైనవే అట్టి విశిష్టులు, రాజాశ్రయము నపేక్షింపనివారును ఆ రచనలు చేసిరనగా ఆనాడు దక్షిణ దేశమున యక్షగాన మెంతప్రజాదరపాత్రమై ప్రచుర ప్రచా రము నందినదో తేటతెల్ల మగుచున్నది.

వేంకటరామశాస్త్రి కృతులు :—

నారాయణతీర్థ త్యాగరాజుల పేరు ప్రతిష్ఠ లాంధ్ర దేశమునకు వ్యాపించినవి. అందులకు కారణము వారి యితర కృతులుకాని యాదృశ్య రచనలు'గావు. వేంకటరామశాస్త్రి కీర్తి తమిళదేశముదాటి రాలేదు. కాని యచట నతని దృశ్య ప్రబంధములకుగల ప్రదర్శన ప్రతిష్ఠలు వారి కృతులకు లేవు. అతని నాటక కృతులుగా చెప్పబడునవి పండ్రెండు :

1. ప్రహ్లాద చరిత్ర, 2. రుక్మాంగద చరిత్ర, 3. మార్కండేయ చరిత్ర, 4, ఉషాపరిణయము, 5. హరిశ్చంద్ర, 6. సీతాకల్యాణము, 7. రుక్మిణీకల్యాణము, 8. కంసవధ, 9. శివరాత్రి నాటకము, 10. సత్సంగరాజు నాటకము, 11. అసత్సంగరాజు నాటకము, 12. జగల్లీలానాటకము, ఇవి

యున్నియు తెలుగుభాషలో రచించబడినవేనట.[5] ఇందు చివరి యారింటిలో నన్నియు నితని కృతు లగునో కాదో, వాని ప్రతు లసలు దొరకుచున్నవో లేదో సరిగా తెలియదు. అవి అంతగా ప్రదర్శనల కెక్కి రాణించినట్లును తోపదు. ఈ గ్రంథము లన్నియు నముద్రితములు. కొన్నిటిప్రతులు గ్రంథలిపిలో విడివిడిగా డాక్టరు శ్రీ వి. రాఘవన్ గారి వంటి వాఙ్మయ పరిశోధకుల యొద్దను, శ్రీ ఆర్. కల్యాణరామయ్యర్ బి. ఏ. (మదరాసు) గారి యొద్దను దొరకుచున్నవి.

తంజావూరు మండలము మెలట్టూరు శూలమంగళాది గ్రామముల చుట్టుపట్లను గొన్నిటి ప్రతులు దొరుకవచ్చును. రుక్మాంగదము సీతాకల్యాణముల అసమగ్రప్రతులుమాత్రము తం. స. మ॥ నకు చేరినవి. (కేటలాగు నం. 582, 673). తం. స. మ. లో నున్న 'నానావిధ నాటకములు' అను రెండు కలగూరగంప తెలుగు గ్రంథములందు (కే. నం॥ 802 & 803) పై పట్టికలోని మొదటి యారింటి పేళ్లును గల గ్రంథభాగములు చెదురుగా నున్నవి. అందుకొన్ని వేం. రా. శాస్త్రి గ్రంథ భాగములే. ఇవికాక తం॥ స॥ మ॥ లో 'నాటక పాత్రలు' అను నింకొక గ్రంథము (కే. నం. 799) గలదు. అందు 'రామాపండితుల నాటకాలు' అని పదమూడు నాటకముల పట్టిక యొకటి తెలుగున గలదు. ఆ రామా పండితు డీ వేంకటరామశాస్త్రి యగునో కాదో కాని యీ పట్టికలో వేం. రా. శాస్త్రి నాటకముల పేళ్లు మాత్ర మైదు (రుక్మాంగదము, ఉషా రుక్మిణీ సీతాకల్యాణములు, శివరాత్రి

---

5. మొదటి యారును తెలుగువే యని చూచి తెలిసికొంటిని.

నాటకము) గన్పట్టుచున్నవి. ఆయా నాటకముల సమగ్ర ప్రతులు సంపాదించి (ఆ యరవదేశపు గ్రంథ లిపి ప్రతులు తప్పులు తడకలు, అందు తెలుగు శబ్దముల స్వరూపములే మారిపోయినవి ప్రక్షిప్తము లనేకమున్నవి) మన లిపిలోనికి మార్పించి ఉన్నంతమట్టునకు తం. స. మ. తెలుగు లిపి ప్రతులతో సంప్రదించి పరిష్కరించి, ప్రచురించుట మంచిది.

వేంకటరామశాస్త్రి నాటకములలో నెక్కువగా ప్రదర్శనల కెక్కి రాణించినవి ప్రహ్లాద రుక్మాంగద మార్కండేయచరిత్రములు, ఉషాకల్యాణము ఇటీవల హరిశ్చంద్ర. అందు ప్రదర్శన విషయమున ప్రహ్లాదయు, [6]రచనా విషయమున ఉషా పరిణయమును [7]గొప్పవని చెప్పుదురు. ఇక్కడ ప్రతి గ్రంథమును విడిగా విమర్శించుట కవకాశముచాలదు. అన్నియు ప్రసిద్ధేతివృత్తములు అన్నిట రచనా ప్రక్రియయు నించుమించొక్క మాదిరిగనే యుండును. స్థూలముగా తత్స్వరూపము నిట నిరూపింతును—

<u>రచనా ప్రక్రియ :—</u>

ప్రతి గ్రంథారంభమునను గ్రంథనామనిర్దేశకమగు కంద మొకటి, పిమ్మట కథాసంగ్రహము కవి స్వవిషయము నుటంకించు ద్విపదయు నుండును కథారంభమునకు ముందు గణపతిస్తుతి మాత్రమే కాక పాత్రప్రవేశ సందర్భముగూడ నుండును. ప్రాయికముగ ప్రతిపాత్ర ప్రవేశమునకును సూచ

6 & 7 ఈ రెండింటికి మాత్రము నేను కూలమంగళము గ్రంథ లిపి ప్రతులు సంపాదించి తెలుగులిపి ప్రతులు తయారుచేయించుకొన గలిగితిని.

నగా నొకసంధివచనము, పాత్రవర్ణన ద్విపద, ప్రావేశికధ్రువ యు నుండును. యక్షగాన సామాన్యముగా అంకవిభాగ మవ సరములేకుండ కథాసంవిధానము తరచు సంధివచనముల ద్వారా సూచింపబడును. సంధివచనాలేకాక పాత్రల సంభా షణ వచనాలు, స్వగతాలుకూడ అక్కడక్కడ నున్నవి. కాని తరచు సంభాషణలు దరువులు దీర్ఘ ద్విపదలలోనే జరు గును. గ్రంథాంతములో మంగళము ఫలశ్రుతియు నుండు ననుమాట. అదియొక పెద్ద విశేషముగాదు; గ్రంథమున ద్విపదభాగము, దరువులు నెక్కువ. పద్యాలు ప్రసిద్ధవృత్తా లు, జాత్యుపజాతులు, తదర్థపద్యాలు అనగా కందార్థాదులు, కొలది సంస్కృత శ్లోకములు, చూర్ణికయు ప్రయుక్తము లైనవి. దరువులు ప్రసిద్ధరాగ తాళములలోనేగలవు. రాగాలు ఆహిరి, ముఖారి, ఉసేని బిలహరి, మోహన, పున్నాగవరాళి, పంతువరాళి, కళ్యాణి, దేవగాంధారి, మధ్యమావతి, సురటి మొ॥ తాళాలు ఆది, చాపు, రూపకము మొ॥ ఆదితాళము వాడకము తరచు, సంగీతశాస్త్రదృష్టితో జూచినచో వేం. రా. శాస్త్రి కృతులలో గొప్పవిశిష్టత గోచరించును. అపు రూపములగు రక్తిరాగము లెన్నింటికో చక్కని లక్ష్యములు రచించినాడు వేం. రా. శాస్త్రి. ముఖ్యముగా ఆహిరియో ముఖారియో ఎత్తుకొనెనా ఆయొక్క రాగమునే విభిన్న సంచారములతో వివిధరసోత్పత్తి కుపయోగించ గలడు. అదొక గొప్పనేర్పు. ఉశేని (హుసేని) స్వరజతియొకటి యితని

ప్రతిభకు తార్కాణముగా పేర్కొందురు పెద్దలు. [8] వేంకట రామశాస్త్రి కృతులన్నిట రచనరూపకోచితమైన సరళశైలి లో సాగిపోవును. ఆయన అనవసరమైన పాండిత్య ప్రాగల్భ్యము చూపించలేదు. నాటి వాడుక నుడిగారపుసొంపు లక్కడక్కడ చిలుకరించినాడు. ఆయన నాటక సామాజికు లలో అధిక సంఖ్యాకు లరవలు గద.

ప్రదర్శన ప్రక్రియ— సంప్రదాయము :—

ఈనాడు మెలట్టూరు భాగవత మేళ నాటకములన్న వేంకట రామశాస్త్రి నాటకములే యన్నమాట. వానిరచనా ప్రక్రియ చాలవరకు యక్షగాన సామాన్యమైనదే యైనను ప్రదర్శన ప్రక్రియ యట్టిదిగాదు. అది మిక్కిలి కట్టుదిట్టములు గలది. అవి ప్రవేశపెట్టినవాడు వేంకటరామశాస్త్రియే. ప్రదర్శన సంప్రదాయములో మాత్రము మన కూచిపూడివారి కనుకరణము కొంతయున్నట్లు తోచును. వెంకటరామశాస్త్రి పూర్వులుగాని యూకూచిపూడి ప్రాంతములకు చెందియుండిన వారేమో మరి! మెలట్టూరు భాగవత మేళ నాటకములు వైశాఖమాస వసంతోత్సవ కాలమున వరుసగా నైదారు రాత్రులు నడుమ నొకనాటి విరామముతో జరుగును. వేం. రా. శాస్త్రి నృసింహోపాసకు డగుటచేగాబోలు అవి సరిగా నృసింహజయంతినాడు ప్రహ్లాద నాటకముతో ప్రారంభింప బడును (కూచిపూడివారికిని ప్రహ్లాదనాటమన్న పట్టు)

మెలట్టూరు పురాధిష్ఠాన దైవతము వరదరాజు పెరుమాళ్లు. వసంతోత్సవ సందర్భమున స్వామివారి ఆలయబహిః

8. See 'The Useni Swarajati' By Dr. V. Raghavan in the journal of the Music Academy, Vol. XVII-Parts I-IV; P. P. 149-159

ప్రాంగణమున పెద్దపందిరి వేయుదురు. అందులో చుట్టుప్రక్కల గ్రామములనుండి నాటకములు చూచుటకు వచ్చిన వారికి భూరి సంతర్పణ జరుగును. బ్రాహ్మణ సమారాధన బాగుగా జరుగును. ఆ పందిటిలోనే నాటకరంగము స్వామి కున్ముఖముగా తీర్చెదరు. నాటకమున్ననాటి సాయంకాలమున స్వామివారి ఉత్సవ విగ్రహమును బహుపుష్పమాలాలంకృత మొనర్చి మేళతాళములతో ఉపనిషత్సూక్త పఠనముతో నూరేగించెదరు. ఆ మాలికలనే రాత్రి నాటకమునందలి ముఖ్యపాత్రధారులు ధరించెదరు. వారి వేషధారణలో వర్ణ వైశిష్ట్యము (Colour values) పాటించబడును. రాజవేషములు తంజావూరి రాజుల కనుకరణగానుండును వారు రాక్షస వేషములకు, వినాయక నృసింహ బ్రహ్మాది వేషములకును కరాళము (Masks) లుపయోగింతురు. నృసింహ కరాళమునకు నిత్యపూజా పురస్కారము జరుగును. (కూచిపూడి వారును కరాళము లుపయోగింతురు.) వారి ముఖ్యమైన సంగీత జంత్రపుహంగు మృదంగము, తిత్తి, ముఖవీణ. సూత్రధారుడు తాళముచిప్పలు పట్టుకొనును.

నాటకము రాత్రి సుమారు పదిగంటల కారంభింతురు. 'నట్టువాంగం' (హంగు) జరిపే భాగవతు లిద్దరు, ముగ్గురు పాటగాండ్రు, జంత్రిగాండ్రు, గ్రంథికుడు, (Prompter) లేక ప్రసంగి అనగా సంధివచనములు చదివెడివాడు, - వీరు హంగుదారులు. సర్వసిద్ధమై జంత్రిగాండ్రు సరే యనగానే భాగవతులు పుండరీకధ్యానశ్లోకములు పఠించెదరు. ఆవెంటనే తైతై యనుకొనుచు కోణంగి రంగమునకు వచ్చును. గ్రంథ

ములో చెప్పబడకపోయినను వానిరాక యొక్క ఆచారము. సూత్రధారిచే పృచ్ఛితుడై వసంతోత్సవ కార్యక్రమము జరిపించుటకై సభవారి నెచ్చరింప వచ్చితిననును. వాలకము హాస్యగాని వలె నున్నను అతడొక మహాభక్తునికింద లెక్క. అటుపిమ్మట భాగవతులు 'తోడై మంగళము' అందురొందురు. తోడై మంగళ మనగా మన తాళ్ళపాక చిన్నన్న రచించిన కీర్తన పంచకము. [9]ప్రతి కీర్తనకు ముందు జతి తరువాత శబ్దము, కౌస్తుభము (మాతు ప్రధానమైన శబ్దజతి వంటిది) పఠింపబడును. ఇక్కడి కిదంతయు 'మేళం కట్టుడల్' అనగా పూర్వరంగ నిర్వహణ.

తదుపరి గ్రంథికుడువచ్చి 'ఆది ద్విపద' అనగా కథా సంగ్రహ కవి విషయిక ద్విపదనొక రాగమాలికలో పఠించి, యొకవచనమున వినాయకపాత్ర ప్రవేశసూచనచేసి యొకజతి చెప్పును. భాగవతులు ప్రావేశికీ ధ్రువను పఠింతురు. తదను గుణముగా నృత్యము చేయుచు గణపతివేషము వేసికొని యొక కుఱ్ఱవాడు వచ్చును. రంగముపై కొంతసేపు కూర్చుండి 'పండారకురుక్కళులు' (పూజారులు) రాగా వారిచే పూజ

---

9. దక్షిణదేశమున యీనాటికిని హరికథలు, భజనలు, బొమ్మలాటలు మొ॥ ప్రారంభించినపుడు తత్పరన మొక పరిపాటి. ఆ పాటల పల్లవులు : 1. నాట, జంపె॥ 'జయజానకీరమణ—జయవిభీషణ శరణ'; 2. ఆరభి—మిశ్రచాపు॥ 'శరణుశరణు సురేంద్ర సన్నుత। శరణు శ్రీసతివల్లభ'; 3. మధ్యమావతి—ఆది॥ 'మురహార నగధర—ముకుంద మాధవ। గరుడ గమన పంకజనాభా'; 4. సావేరి—రూపకము॥ 'దేవేశ గణారాధిత—దివ్యాంబుజపాద। శ్రీ వేంకటగిరి నాయక—శ్రీశ హెచ్చరిక'; 5. పంతువరాళి—ఆది॥ 'మాధ; భవతు తే మంగళమ్। మధుమురహార తే మంగళమ్',

లందికొని, మరల నృత్యము చేయుచు నిష్క్రమించును. అంతట జతియుక్తముగా నొకవచనము పఠించి కటికమువాని ప్రవేశము సూచించుచు ప్రసంగి, భాగవతుల దరువున కనుగుణముగ నృత్యముచేయుచు కటికమువాడు ప్రవేశించును. కటికమువాడనగా రాజుగారి రాకగురించి సభవారికి నెచ్చరింప వచ్చు చోపుదారు మార్కండేయచరిత్రలో మాత్రము రాజపాత్రకు ప్రసక్తి లేదని కాబోలు వీనివాలకము కనిపించదు. అందులో కురవంజి (ఎఱుకత) పాత్ర విశేషము కటికము భాగవతులచేత పృచ్ఛింపబడి తానెవడో యెందుకు వచ్చినట్లో చెప్పి వెళ్లిపోవును. ఆ తరువాత కథాపాత్రలు యథాసంప్రదాయ క్రమముగా సూచన వర్ణనలైన వెంటనే ధ్రువానుగుణ నృత్యముతో ప్రవేశించి వెంటనే నాటకప్రవర్తనలో పాల్గొనును. నాయికపాత్ర ప్రవేశ విషయములో మాత్రమొక విశేషముండును. ప్రావేశిక ధ్రువతో ప్రవేశించిన నాయికాపాత్రధారి తన నర్తనకళాప్రావీణ్యము ప్రదర్శించవలె నుండు. అందులకొక 'అల్లారిప్పు' (శుద్ధ నృత్తము), 'మెయ్' (తారస్థాయి, షడ్జస్వరము, అదితాళములో తాళజతి ప్రధానమైన సంగీత ప్రక్రియ), తిల్లాన, శౌక్కవర్ణము అభినయించి తీర్మానము చేయవలెను. నాటకమున సామాన్యముగా ప్రతిపాత్రకును అభినయపద్ధతి కరతలామలకముగావలె, అందును కూచిపూడి భామవేషగానికివలె నిందు నాయికపాత్రధారికింతో అభ్యాస ముండవలెను. ఈ నాటకములలో

స్త్రీ పాత్రలు పురుషులచేతనే నిర్వహింపడును.[10]

ప్రసంగి గ్రంథములోని సంధివచనములనే కాదు వర్ణనాత్మకములైన ద్విపదలనుగూడ చదువవలెను. సంవాదాత్మకములైన ద్విపదములు, పద్యములు మాత్రమే పాత్రధారులచే పఠింపబడును. ఇవి నృత్యప్రధానములైన నాటకములు కావున పాత్రధారి ప్రతిదరువునకును నృత్యముపచరించవలెను. అట్టిచో ఆదరువులుకూడ వారే పఠించుట కడు కష్టమైనపని. అందుచే నాటకములోని పాటలన్నియు పాత్రధారులవికూడ సూత్రధారుడే ఎత్తుకొని తనహంగుదారులకు ముందుముక్కలందిచ్చి తాను చివర తీర్మానము చేయును. వారి వంతలకనుగుణముగా అభినయముమాత్రమే పాత్రధారులు చేయునది. ఈ పట్టున మాత్రమిది కథకళి ఫక్కి. కథకళి కేవలము ఆంగికాభినయ ప్రధానమైనది. అందు వాచికము పూర్తిగా పరిహరింపబడును.[11] ప్రసంగి పాత్రల నెప్పుడును పల్కరించడు. సూత్రధారుడే ప్రతిపాత్రను ప్రవేసింపగనే ఆపాత్రను తదుదంతము గొంత, అనగా నీ వెవరవు, ఎందులకు వచ్చినట్లో చెప్పుమని పృచ్ఛించును. అప్పుడప్పు డతడు కథను వ్యాఖ్యానించుటయు గూడ నుండును.

ఈ నాటకములలో వధాదుల ప్రదృశ్యములన్న భరత సంప్రదాయములు పాటింపబడును. హిరణ్యకశిపుడు నరసిం

10. త. స. మ. లోని 'నాటకపాత్రలు' పట్టికలలో గూడ స్త్రీపాత్రలు పురుషులే ధరించినట్లు స్పష్టముగా తెలియుచున్నది. కూచిపూడి వారు నట్లే చేయుదురు.

**11. Vide : Triveni Vol. 7 No. 4 for an essay on 'Dance traditions of South India' by Mr. K. V. Ramachandran.**

హునితో (నృసింహపాత్రధారి ఆదినమంతయు నుపవాసము చేయును. ఇది కూచిపూడి ఆచారమే) మదించి అతడు తన్ను పట్టవచ్చు సరికి తెరలోనికి పారిపోవును. అక్కడితో ఆనాటక మయిపోయినట్లే. నాటకము పూర్తియగుసరికి తెల్లవారును. భాగవతులు భూపాలరాగములో కీర్తన ఎత్తుకొని 'గర్భగుడి' లోని స్వామికి ప్రదక్షిణ దీపారాధనము లొనర్చి పురవీధుల లోనికి నొక మేళముగా బోయి యింటింటికడ యథోచిత ముగా గౌరవింపబడుదురు. (కూచిపూడి భాగవతులు నిట్లే చేయుదురు.)

పై లక్షణములనుబట్టి చూచినచో వేంకటరామశాస్త్రి నృత్యరూపకము లెంత లగువు బిగువులు కలిగినవో తెలియ గలదు. కూచిపూడి వానివలె నివియు కేవలము బ్రాహ్మణ మేళముల వారిచేతనే ప్రదర్శింపబడునవి. కాని కూచిపూడి బ్రాహ్మణమేళముల వారూరూర దిరుగుదురు మెలట్టూరు వారూరు విడచి ప్రదర్శించరు. వేంకటరామశాస్త్రి నాటకము లను మెలట్టూరు చుట్టుపట్లనున్న శూలమంగళము, ఊత్తు క్కాడు, శాలియమంగళము, నల్లూరు, తేవప్పెరుమాళ్ నల్లూరు మొదలగు గ్రామములలోని బ్రాహ్మణ మేళముల వారుగూడ ప్రదర్శించుటకు పూనుకొనిరి. వారును మెల ట్టూరివారివలె వారి గ్రామములలోనే విష్ణు సన్నిధానము లోనే ప్రదర్శనలు జరుపుదురు. అందుచే నవి మతప్రయో జనాత్మకములైనవని కొందరందురు.

ఆయా మేళములగురించి తెలియదగిన విశేషములు: మెలట్టూరివారి తరువాత చెప్పుకొనదగినది. శూలమంగళము

వారు, వారు వేం. రా. శాస్త్రి నాటకములనేకాక కొఱవం జికూడ యాడుదురు అది యెక్కువగా ప్రజాదరము జూర గొన్నదట. వారు తమ ప్రదర్శనములలో గొన్ని హాస్య పాత్రలను సాంప్రదాయికముగా రూపొందించినారు. అవి కొఱవన్, కొఱతి (ఎఱుకడు, ఎఱుకత,) కరకం (గ్రామదేవత ఘటముధరించువాడు), కుడుహుడుప్పాండి (శకునపక్షి), కప్పల్, గంజిన్ అనే తురక వేషపు హాస్యగాండ్రు. వీరు నాటకకథతో సంబంధములేకుండగనే ప్రేక్షకులను రంజింపజేయుటకు రంగ ముపైకి వత్తురు. వీరి ప్రసంగములు మాత్రము అరవములోనే జరుగును. ఉత్తుక్కాడులో వేం. రా. శాస్త్రి నాటకములకు ముందు రాధాకృష్ణ విలాసము, పార్వతీ పరిణయము, [12] భామకలాపము, గొల్లకలాపము అనునవి ఆడుచుండెడి వారట. కలాప మనగనే కూచిపూడి జ్ఞప్తికివచ్చును అది నృత్యప్రధానమై ఉపరూపక సదృశ్యమైనది. [13] వేం. రా. శాస్త్రి వానిఁజూచిన జూచియుండవచ్చును. తదుపజ్ఞమైన నాటకప్రదర్శన ఫక్కికకు అవికొంత యుద్బోధకములై యుం డిన నుండవచ్చును. ఈగ్రంథములును తెలుగువే. కుట్టనూ రులో మాత్రము తమిళ రుక్మాంగదము ఏడురాత్రులు ప్రద ర్శించెడివారట. నల్లూరు భాగవతుల నాట్యవిద్యకు ప్రమాణ

12. ఇది నుదురుపాటి వెంకన కవి దని గుర్తించితిని. దీని ఉత్తుక్కాడు గ్రంథలిపి ప్రతి శ్రీ రాఘవన్ గారి కడగలదు. ఒక తెలుగు లిపి ప్రతి ఆంధ్ర సాహిత్యపరిషత్తులో నున్నది. (నెం. 166)

13. For details vide., 'The Kalapam', an article by the present writer in Triveni, Silver Jubilee Number, 1955.

గ్రంథములు అభినయ దర్పణము, భావప్రకాశనము, రస మంజరి అని తెలియవచ్చినది.

ఇట నృత్యరూపకముల యుత్పత్తిగురించి కొంత వ్రాయుట అప్రస్తుతముగాదు. భారతీయ నాట్యకళా సంప్రదాయ సర్వస్వమునకును భరతుని నాట్యశాస్త్రమే మూదల. భరతము తరువాతతరువాత దేవదాసీజనమునకును శైవస్మై వారివలన విపులప్రచారముగాంచినను వారి కస లాశాస్త్రము చదివి చెప్పవలసిన గురుస్థానములు బ్రాహ్మణపండితులే యైరి. ఆపండితులలో కేవలము విద్యావ్యాసంగసంతుష్టులు గాక శాస్త్రప్రయోజనాభినివిష్టశీలురైనవారు కొందరు మేళములుగా నేర్పడి తాము ను గొన్ని ప్రదర్శనములు చేయుట కారంభించి యుందురు. అట్టి బ్రాహ్మణమేళము ప్రసక్తి క్రీ|| శ|| 9 వ శతాబ్దినాటి కాశ్మీరకవి దామోదరగుప్తుని కుట్టనీమతమున గలదట. కుట్టనీమతమున 800 వ శ్లోకమున గల యొక రూపక విశేష ప్రసక్తినిబట్టి చూచినచో దక్షిణ దేశపు రూపకపద్ధతులకు జాల సన్నిహితముగా నున్నదని రాఘవన్ గా రనియున్నారు.[14] ఆయన దక్షిణదేశపు భాగవతమేళనాటక సంప్రదాయ మతి ప్రాచీనమైనదనియు, అది తంజావూరి చోళరాజులనాడు దేవాయతనస్థ నాటకశాలలో బ్రాహ్మణమేళాలచే ఆడబడు 'అరియకూత్తు' అనుదానికి సంబంధించిన దనియు ననియున్నారు. అరియకూత్తు ప్రసక్తి

14. See his essay on Yakshagana — Triveni Vol. 7, No. 2.

గల రెండు చోళశాసనముల నెత్తి చూపియున్నారు.[15] అది శిలప్పదిగారమున పదిరకములగు కూత్తు (నృత్యము, నాట్య ప్రదర్శనము లేక నాటకము) లలో నొకటిగా నుదాహరింప బడినది. కాని 'అరియకూత్తు' సప్తాంకికయని పై శాసనము లలో రెండవది తెలుపుచున్నది. మెలట్టూరు భాగవత మేళ నాటకములలో అంకవిభాగము గానరాదు. అట్టిచో రెండిటి కిని సాదృశ్యము నూహించుట సమంజసముగా దోపదు. అసలు నృత్యప్రధానములైన రూపకము లనగా ఉపరూపక ములు. భరతనాట్యశాస్త్రమున వానియుబుసులేదు. బహూ పరూపక లక్షణము విపులముగా నిచ్చినవారిలో ప్రధానుడు భావప్రకాశనకర్త యగు శారదాతనయుడు. (క్రీ॥శ॥ 1175-1250) అతడు దక్షిణదేశీయుడగుటయు[16], అతని భావ ప్రకాశనము నెల్లూర్ఱు భాగవతులకు ప్రమాణ గ్రంథ మగు టయు గమనింపదగినవి.

పద్మావతీచరణచారణచక్రవర్తి యగు జయదేవుడు తన గీత గోవిందము నభినయ పద్ధతి కుద్దేశించెననియును మన సిద్ధేంద్రయోగి భామకలాపమునకును, నారాయణ తీర్థుల శ్రీకృష్ణలీలాతరంగిణికిని దాని 'బాణీ' యే మూదలయనియు పెద్దలందురు. సిద్ధేంద్రయోగికి ముందే ప్రసిద్ధులైన కూచి పూడివారి ప్రదర్శన లెంతవరకు నృత్యప్రధానములై యుండెనో తెలియదు గాని సిద్ధేంద్రయోగి భామకలాపము మాత్రము భావాశ్రియమైన నృత్యకళ ప్రధానముగా వెలసినది. (అది

15. Tanjore Inscriptions:—154 of 1895 & 120 of 1925.

16. చూ. భావప్రకాశనము- బరోడా ప్రతి, 1930-ఉపోద్ఘాతము.

ఆత్మాశ్రయ షట్కికము, నాయికానాయక సఖీపాత్ర ప్రథానము నగుట గీతగోవింద సామ్యము). శ్రీకృష్ణ లీలాతరంగిణి వస్తుప్రధానమైన రచనయైనను తాళజతి బహుళములైన ఆ తరంగములన్ని పదములవలె హృదయంగమాభినయోద్దీపకములుగా నున్నవి. వేంకటరామ శాస్త్రి అరియకూత్తు, భావప్రకాశన, గీతగోవింద, భామకలాప, కృష్ణలీలాతరంగిణుల నన్నిటిని జూచి యుండవచ్చును గాని వానితో నతని నృత్యనాటకములకు ప్రత్యక్షసంబంధ మేమియు గానరాదు. అవి యతని నూతన నృత్యరూపక శిల్పసంకల్పమునకు దోహదకారులై యుండవచ్చును. ప్రత్యక్ష సంబంధము కూచిపూడివారి కలాపములుగాక తదితరములగు ప్రహ్లాదాది నాటకములతోడను, తంజావూరు నాయక మహారాష్ట్ర ప్రభువుల ప్రాపకమున వెలసిన యక్షగానములతోడను, (ఇవి ఆంధ్రదేశపు సామాన్య యక్షగానములవలె శుద్ధ నృత్తనాట్యములతో సరిపుచ్చవచ్చునను మచ్చువి కాక నృత్యకళా ప్రియంభావుకులగు ఆ ప్రభువుల అభినివేశము కారణముగా నృత్యసమృద్ధములై వెలసినవి), ఇంకను మలయాళదేశపు కథకళి (తమిళదేశమునకు దగ్గరిదే మలయాళము. అదికాక కథకళి కళా ప్రవర్తకులలో ప్రథముడు గాకపోయినను ప్రధానుడగు త్రియిమ్మణతంపి వేం. రా శాస్త్రికి సమకాలికుడే ఆ దినములలోనే కథకళి కళాసాహిత్య ప్రతిష్ఠ పరాకాష్ఠ నందినది) తోడను కొంతకుగొంత యున్నట్లూహింపవచ్చును. కాని వే. రా. శాస్త్రి కృతులకు వాని ప్రత్యేకత వానికున్నది.

ఈ నా డే శేటట నీ భాగవత మేళనాటకములు జరుగు చున్న దొక్క మెలట్టూరులో మాత్రమే. కాని యా మేళ ములవారును అక్కడ కనిపెట్టుకొని యుండిన రాజపోషకుల రోజులు పోయినవి. ఇపుడు పొట్టపోషణము జరుగుటలేదని నేటి చదువులు చదువుకొని పెద్దపెద్ద యుద్యోగులై దేశము నలుమూలల జెదరియున్నారు. కాని యొక విశేషము. ఈ భా. మే. నాటకములలో కొన్ని కొన్ని పాత్రధారణములు ప్రత్యేకము కొన్ని కొన్ని కుటుంబముల వారికి హక్కుగా పరిగణింపబడుచున్నవి. అందుచేతనే కాబోలు వారందరు నా వసంతోత్సవముల (అప్పుడే వేసవి సెలవులు) నాటికి స్వగ్రామములో కలసి యా నాటకములను నిర్వహించు చున్నారు. అనగా వారి దెంతటి మహత్తరమైన యభినివేశమో తెలియుచున్నది. ఇంచుమించు వారందరును అరవలే. అయినా మహాపురుషులైన మన తీర్థులు, వెంకటరామశాస్త్రి, త్యాగ య్యలు వారి కిలువేల్పులవంటివారు. మన వారిని తగినట్లు గౌరవించుకొనుటలో మనమే వెనుకబడియున్నాము. ఇది వరకు తీర్థులు త్యాగయ్యలను కొంత కొంత ఎరుగుదుము కాని గట్టిగా వెంకటరామశాస్త్రి పేరు వినలేదు మనము. అతడు స్వయముగా గజ్జెకట్టినాడో లేదో గాని నాటకగ్రంథ కర్తయై తత్ప్రదర్శన ప్రక్రియా సంప్రదాయ సంధాతయు తానేయై అరవసోదరులను కూడగట్టుకొని, వారి మన్నన లకును పాత్రుడైన మహానుభావుడు. (ఆయన గురించియు, ఆయన నాటకముల గురించియు శ్రీ రాఘవన్ ప్రభృతులు కొలదిమంది తమిళదేశపు పండితులు మాత్రము కొద్దికొద్దిగా

ఆంగ్ల తమిళ పత్రికలలో వ్యాసములు వెలయించి యుండిరి. అరవలు భాషా విషయములో మనకు పితృదేవతలవంటివారే యైనను సంగీత విషయమున మన భాషకున్న మాధుర్యము వారి భాషకులేదని కాబోలు వారి రాష్ట్రములో వెలసిన మన సంగీత సాహిత్యాదుల నాదరించి ప్రచారమునకు దెచ్చి సహృదయతను ప్రకటించిరి. అందుల కాంధ్రులకు వారవశ్య మభివందనీయులు).

మెలట్టూరులోనైనను భాగవత మేళనాటక ప్రదర్శనము లెల్లకాలము సాగగలవని చెప్పలేము. అంతటి యుత్కృష్ట కళాసృష్టి నన్యరాష్ట్రముల వారికిని అది సజీవముగా నుండగనే ఎరుకపరచుట మంచిది. ఆ భాగవతులు తమయూరి పొలిమేరదాటి ప్రదర్శించరు. వారికి ధనార్జనాశ లేదు. ఎంత కుతూహల మున్నను దూరప్రదేశముల నున్నవా రందరికి నక్కడికి పోయి చూచుట కవకాశము లుండవు. అంతేకాదు మన తరువాతి తరాలవారికిని ఆ కళాస్వరూపము నందజేయుట అవశ్యము వాంఛనీయము. అందుల కొక్కటే మార్గము గలదు. ప్రభుత్వమువారైన పూనుకొని వెంటనే 'డాక్యుమెంటరీ' చిత్రములు నిర్మించుట.

---

గమనిక:— నాకీ వ్యాసరచనలో ఆకరములు పేర్కొనబడని అనేక ముఖ్య సందర్భములందు మిక్కిలి తోడ్పడినట్టి వివి :

1. కూలమంగళము భాగవతోత్తములు శ్రీ ఎం. స్వామినాథ భాగవతార్, బి ఏ. (మదరాసు), శ్రీ ఆర్. కల్యాణరామయ్యర్, బి. ఏ. (మదరాసు) గారలు దయచేసిన విలువగల విపులమైనభోగట్టా గ్రంథములు.

2. డాక్టర్ శ్రీ వి. రాఘవన్, ఎం.ఏ., డి.లిట్ గారి భాగవత మేళనాటకములను గూర్చిన ఆంగ్లవ్యాసము (Journal of the Indian

Society of Oriental Art—Sri Coomaraswamy Comemoration Volume)

3. 'The Music of the Nrtya Natakas of South India' By Srimati K. Gomati. (Thesis submitted for M. Litt of the Madras University— ఇది అముద్రితము. మదరాసు విశ్వవిద్యాలయ గ్రంథ భాండాగారమున దీనికి 'టైపు' ప్రతిగలదు. శ్రీమతి గోమతిగారు కూడ యీ విషయము గురించి శ్రీ స్వామినాథ భాగవతార్ కడ శుశ్రూష చేసినవారే.)

వీరందరికిని నా కృతజ్ఞతా పురస్సరమైన అభివాదములు.



# ద్రౌపది మాతృహృదయము

## భారత భాగవతావిష్కరణములు

మహాభారతము, శ్రీమద్భాగవతము రెండును వ్యాసకృతములేయని పలువురు పండితుల తలంపు. కాని రెండిట కావ్యాంతర స్నాయువులను స్పృశించి ఆయా గ్రంథకర్తల కైవాడమును బట్టియిచ్చు శైలి, సదృశ కథాసన్నివేశములందలి ఆయాపాత్రచిత్రణము, ఆ పాత్రలలోనుండి తొంగిచూచు కవి యాత్మీయతయు బహుధా సాదృశ్యముకంటె భేదమునే స్ఫురింపజేయుచున్నవి. భారతశైలి యటనట జటిలములగు వ్యాసఘట్టములను గలిగియున్నను భాగవతశైలి యంత గాఢపాకముగలది కాదు. ఇట శైలివిషయ మప్రస్తుతము. ఏకైక కథాసందర్భమునందు రెండిట నెట్లొక్క సన్నివేశము భిన్నమార్గముల నడచినదో చూతము. ద్రౌపదీ పుత్రశోకఘట్టము మహాభారతమున సౌప్తిక పర్వమునను (ఏకాదశాధ్యాయము—శ్లో॥ 13, 14, 15 మొ॥), భాగవతమున ప్రథమస్కంధమునను (సప్తమాధ్యాయము— శ్లో॥ 42-47 మొ॥) గలదు. ఆపట్టున నా రెండిట నామె మాతృత్వమావిష్కరింపబడినతీరు వేరు. అదే ప్రకృత వ్యాసవిషయము.

భారతయుద్ధమైపోయినది. ఇక పాండవులదే కురుక్షేత్రమున నేకచ్ఛత్రాధిపత్యము. పాండవుల పట్టమహిషి ద్రౌపది పట్టిన పంతము లెల్ల నెరవేరినవి. ఆమె ఉల్లాసవారాశి నోలలాడుచుండిన సమయమది. కాని అప్పటికే యామె కొక కోశమున శోకము కొంత లేకపోలేదు. అది పితృ

శోకము. తన సపత్నులగు హిడింబా సుభద్రలవలె పుత్రశోకమునూత్ర మప్పటికెరుగదామె. తన పతులకు జయము నిశ్చయమై యికనట్టి విపత్కర విషయము నూహింపనక్కర లేని పరిస్థితి యామెది. కాని హఠాత్తుగా అశ్వత్థామ సౌప్తిక పర్వము నిర్వహించిన కఠోరదుర్వార్త యామె కర్ణపుటముల బడినది. అప్పుడామెకు పుత్రశోకముకన్న పుత్రఘాతి యగు నశ్వత్థామపై నాగ్రహమెక్కువగా ప్రజ్వరిల్లి పాండవు లశ్వత్థామను సపరివారముగా నాశనము చేయకున్న తానే ప్రాయోపవేశము చేయుటకు ప్రతిన పట్టినదని భారతమిట్లు చెప్పుచున్నది.

> 'తస్య పాపకృతో ద్రౌణేర్న చే దద్యత్వయానఘే
> హ్రియతే సానుబంధస్య యుధి విక్రమ్య జీవితమ్॥'
> 'ఇహైవ ప్రాయ మాశిష్యే తన్నిబోధత పాండవాః
> నచే త్ఫల మవాప్నోతి ద్రౌణిః పాపస్య కర్మణః॥'
>
> — సౌప్తిక XI. 14, 15.

ద్రౌపది యెన్నడైన నోములు వ్రతములను బట్టినదో లేదో కాని ఇట్లు ప్రతినలు పట్టుట మాత్ర మామెయెడల సామాన్యమైన విషయమే ఐనను నింత ఘోరమైన ప్రతినను తనప్రాణమే పణమొడ్డిన ప్రతిన నిదివరకామె తన జీవితములో పట్టియుండలేదు అమె పంతములు చెల్లింప భీముడున్నాడు. మహాభారతము ప్రకార మతడే యామెచే నియోగింపబడి నాడు కాని కృష్ణార్జునులు, ధర్మజుడు నాతనిని ననుసరించు నట్లును, అర్జునాశ్వత్థామలకు ఘోరయుద్ధము జరిగినట్లును, వ్యాసభగవానుడే దిగివచ్చి యాతగవును పరిష్కరించినట్లును చెప్పబడినది.

భాగవతమున ద్రౌపది తన కొడుకులకొరకు తానేడ్చుటయే గాని యొక ప్రతిన పట్టినట్లుగాని, అశ్వత్థామను హతమార్పవలసినదని యొకరి నాదేశించినట్లుగాని చెప్పబడలేదు. పైగా అక్షంతవ్యుడగు హంతకు డశ్వత్థామను క్షమించినది. అర్జునుడే అశ్వత్థామను హతమార్ప స్వయముగా ప్రతినగొని బయలుదేరును. ఆ సందర్భమున వ్యాసుడెక్కడను అవతరించడు. అర్జును డశ్వత్థామను బంధించి ద్రౌపదికడకు గొనివచ్చును. అప్పుడు కట్టెదుట కర్మజుగిప్సితుడై అవాఙ్ముఖుడై యున్న అశ్వత్థామను జూచి ద్రౌపది ఎంత చెడినను గురుపుత్రుడని కాబోలు నమస్కరించినదట! ('వామస్వభావా కృపయా ననామ చ' అని భాగవతము. అట నాద్రౌపదీ విశేషణమునకు భాగవతవ్యాఖ్యాతలగు శ్రీధరుడు శోభనస్వభావయనియు, వీరరాఘవుడు అక్రోధన స్వభావయనియు అర్థములు చెప్పిరి). వెంటనే ఎంత హంతకుడైనను అతడట్లు బంధనముతో గొనిరాబడుట సహింపనిదై 'ముచ్యతాం ముచ్యతా మేష బ్రాహ్మణోఽనితరాం గురుః' అనగా విడువుడు విడువుడితడు బ్రాహ్మణుడు, గురువుకంటె వేరుకాడని యన్నదట. తదుపరి యర్జును నుపలక్షించి యిట్లన్నది:

'సరహస్యో ధనుర్వేదః సవిసర్గోపసంయమః
అస్త్రగ్రామశ్చ భవతా శిక్షితో యదనుగ్రహాత్ ॥'
'సఏష భగవాన్ ద్రోణః ప్రజారూపేణ వర్తతే
తస్యాత్మనోఽర్థం పత్న్యాస్తే నాన్వగాద్వీరసూః కృపీ.

—భాగ. ప్రథమస్కంధము, VII 44, 45

అనగా, ప్రయోగోపసంహార పూర్వకమగు ధనుర్వేదము సరహస్యముగా సానుగ్రహముగా నీకునేర్పిన ద్రోణ

భగవాను డీపుత్రరూపమున గన్పట్టుచున్నవాడు, (అందుచే తనే) వీరమాతయగు ఆయన యర్ధాంగి కృపి పతి ననుగమింపలేదు-అని యర్థము. ఆ వెంటనే ధర్మరాజు నుద్దేశించి :

'తద్ధర్మజ్ఞ మహాభాగ భవద్భిర్గౌరవం కులమ్
వృజినం నార్హతి ప్రాప్తుంపూజ్యం వంద్య మభీక్ష్ణశః'

శ్లో. 46

(ధర్మజ్ఞ! మహాభాగ! మీావలన పూజ్యము వంద్యమునగునట్టి గురుకులమునకు చేటు గలుగరాదు)

'మారోదీ త్తస్య జననీ గౌతమీా పతిదేవతా
యథాహం మృతవత్సార్తారోది మ్యశ్రుముఖీ ముహుః

—శ్లో. 47

(నేనెట్లు మృతవత్సార్తనై అశ్రుముఖనై మాటికి నేడ్చుచుంటినో పతిదేవతయగు కృపియు నట్లేడువదగదు)

యైః కోపితం బ్రహ్మకులం రాజన్యై రజితాత్మభిః
తత్కులం ప్రదహ త్యాశు సానుబంధం శుచార్పితమ్.'

శ్లో. 48

(అజితేంద్రియులగు ఏ రాజువలన బ్రాహ్మణ కులమునకు కోపముగలుగునో ఆ రాజకులమునే తత్కోపాగ్ని దహించును) అని యన్నది.

అప్పటి యామె మాటలతీరు ధర్మన్యాయదయాన్వితము, నిర్వ్యళీకము, సమభావ సముల్లసితమునైన దనియు, ధర్మజుడును తత్రత్యులగు ద్విజులు నామె నభినందించిరనియు భాగవతమున నిట్లు చెప్పబడినది :

'ధర్మ్యం న్యాయ్యం సకరుణం । నిర్వ్యళీకం సమం మహత్ ।
రాజా ధర్మసుతో రాజ్ఞ్యాః । ప్రత్యనంద ద్వచో ద్విజాః॥' శ్లో॥ 49

అప్పటి కింకను భీము డొక్కడే అశ్వత్థామ వధార్హు డని వాదించువాడుగా మిగిలినాడు. అతడు చేయి చేసికొను లోపున కృష్ణుడు కలుగజేసికొనుటచే అశ్వత్థామ రక్షింప బడెను. అదే భాగవత ద్రౌపది కభిమతమైనది. ఆ పాత్రలో భాగవతకర్త ఎంత మహోన్నత మాతృభావము నిమిడ్చి నాడు! ఎంత హృదయ స్పందియైన సన్నివేశమది!

అపుడు ద్రౌపది కురుక్షేత్ర మహారాజ్ఞి. అచ్చో న్యాయాన్యాయ విచార మొనర్చుట కామె కధికారము గలదు. శిశుహంతకునకు శిక్ష ఉరికి తక్కువ మరిలేదు. ఈ సందర్భమున ఆ మహారాజ్ఞియే ఆ నేరమున కెరయైనది. అది కాక ఆమెకు దోషియగు నశ్వత్థామకు తమతమ తండ్రుల నాటినుండి యొకపగ పరిపాటిగా వచ్చుచుండినది. (ద్రోణుడు తన్నవమానించెనని ద్రుపదుని పరాభవించును. ద్రుపదు డా పరాభవము సహింపజాలక యొక యజ్ఞముచేసి ద్రోణుని జంపగల కొడుకును ధృష్టద్యుమ్నుని బడసినాడు. భారత యుద్ధములో ద్రోణుడు తన ప్రతాపమును పాంచాలురపై బట్టించినాడు. ద్రుపదుని గడతేర్చినాడు. ధృష్టద్యుమ్నుడు ప్రాయోపవిష్టుడైయున్న ద్రోణుని కంఠ ముత్తరించినాడు. అశ్వత్థామ ఉపపాండవులతో పాటు ధృష్టద్యుమ్నుని హత మార్చినాడు). భాగవతమున ద్రౌపది కా ప్రతీకారస్మృతి యైన యున్నట్లు చెప్పబడలేదు. అందు ద్రౌపది ద్రోహి నొక మహారాజ్ఞివలెగాక మాతృత్వము మూర్తీభవించిన యొక మహాదేవతవలె చూచినది. అందును ఆ మాతృత్వము తన బిడ్డలనుమాత్రమే ప్రేమింపగలిగి వారి మృతికి దుఃఖించు

సామాన్య మాతృత్వము గాదు; ఏతల్లి బిడ్డలయెడనైన హేరాళముగా ప్రకటింపగల వాత్సల్యము, ఏ బిడ్డలతల్లి యెడనైన సానుభూతి ప్రకటించగల యౌదార్యమును గల మహోదాత్త మాతృత్వము. అదే సూనృతమైన మాతృత్వ రహస్యము. మాతృత్వ మహిమ కది పరసీమ.

భారత ద్రౌపది పాత్రలో రాజసప్రవృత్తి గన్పట్టును, అందు పుత్రశోక మామెయెడ క్రోధముగా పరిణమించి ఆ క్రోధం బప్రతికారమై ప్రతీకారమునకు ప్రేరేచినది. భాగవతమున అసలే అతిమృదులమగు నా మాతృహృదయమునకు మరింత మార్దవము చేకూర్చినదా పుత్రశోకము. ఆ విషయమున భారతచిత్రణము లోకసామాన్యమైన వాస్తవికతకు చాల సన్నిహితముగా నున్నదగునుగాక కాని భాగవత చిత్రణ మా మహాగ్రంథ పరమార్థమునకు దగినట్లు లోకోత్తరమై ఆదర్శప్రాయమై యొప్పుచున్నది.

ఈ ద్రౌపదీ పుత్రశోకసందర్భ మొక్కటి చాలును భారత భాగవతములు రెండు నేకకర్తృకములని పరంపరగా వచ్చు నభిప్రాయార్థమును సంశయించుటకు భాగవతము అష్టాదశ పురాణములలో నొకటి. పురాణములెల్ల వ్యాస ప్రణీతములని యొక అభిప్రాయము. కాని పురాణములలో ఒక కథయే భిన్నగ్రంథములందు భిన్నరీతుల వ్యాఖ్యానింపబడుట తరచుగా గన్పట్టును. అవియెల్ల నేకకర్తృకము లనుట సమంజసముగా తోపదు విషయవికల్పతమాట యటుండ నొక గ్రంథకర్త యొక జన్మలో నన్నిబృహద్గ్రంథములు స్వకపోలకల్పితములుగా ఆవు లక్షురముల కొకరవ్వులైన యా

రోజులలో రచించెనన్న నమ్మకమునకు దమ్ముచాలనిమాట. భిన్నవ్యక్తుల చేతనైనను నవి యన్నియు నొక్క కాలమున రచింపబడి యుండవని తోచును. అందలి గాథలు దేశము వివిధభాగములం దుప్పతిల్లి తరతరముల జనుల నాలుకలపై నాని నాని పండితులచే చిత్రవిచిత్రములైన ఆభిమానిక వ్యాఖ్యానములకులోనై వ్యాసుని కాలమున నతనిచే సంకలితములై పరిష్కరింపబడి గ్రంథరూపము దాల్చి యుండ వచ్చును. వ్యాసుని అనంతర మందం దనేక ప్రక్షిప్తములు చేరియుండవచ్చును. అందుచేతనే ఒక పురాణమునకును మరి యొక పురాణమునకును అంత ఏకవిషయ వైకల్ప్యము. అంతేకాని వ్యాసునివంటి లోకోత్తర మనీషి, మహర్షి గ్రంథ గ్రంథమునకును తన యభిప్రాయము నట్లు మార్చుకొనడు. అయితే అతని స్వతంత్ర కృతిగా నెన్నబడుచున్న భారతము నందలి వస్తువే భాగవత పురాణమునందు మారియుండుట చూచియున్నాము. మరి భాగవతరచన ఆయన చేతిమీదు గనే నడచియుండిన నామార్పెట్లు సంభవించినది ? కొందరు భాగవత మతని పిదపరచనయై, అప్పటి కతని యభిప్రాయ ములు మారియుండవచ్చు ననవచ్చును. భాగవతము, భారత మునకు పిదపరచనయే కావచ్చును. కాని మహాభారత రచనాకాలముననే అసాధారణ మేధానిధి, అంతర్ముఖుడు, స్థితప్రజ్ఞుడగు కోవిదుడు, సంయమి ప్రవరుడునైనట్లు కన్పించు వ్యాసభట్టారకుడు తన భారతభావములకు తానే భాగవత మును తరువాత రచించియుండిన నందంత మార్పంగీకరించి యుండునా ? అదికాక భారత భాగవత రచనాశైలులలో

భేద మధికముగా జూపట్టుచున్నది. ఆకారణము చేతను రెండిటి భిన్నకర్తృత్వము నంగీకరించుట లెస్స యనిపించు చున్నది. అనగా భారత భాగవతకర్త లిరువురును వ్యాస నామధేయులే కావచ్చును కాని భిన్నవ్యక్తులై యుందురనుట. శైలీవిషయము నుపేక్షించి వస్తువిషయమున ప్రక్షిప్తవాద మును పురస్కరించుకొని యీ ద్రౌపదీ పుత్రశోకఘట్ట మట్టి ప్రక్షిప్తభాగములలో నొకటియనిన ననవచ్చును. అట్లైన భాగవత ద్రౌపదిపాత్ర చిత్రణవిషయమునైన భారతకర్తకు జోక్యములేదనుట నంగీకరింపవలసివచ్చును. నాయుద్దేశము భాగవత ద్రౌపది భారతకర్తయగు వ్యాసుని సృష్టికాదనియే ఇందుల కింకొకయూహా యుపబలకముగా నున్నది. భారత కథ కనేక ముఖ్యపాత్రల పరస్పర ప్రతీకారవాంఛ ఆయువు పట్టుగా దోచును. ఆకథలో ననేక సన్నివేశములం దాప్రతీ కార తత్త్వస్వరూపము పరిస్ఫురించినది. గ్రంథకర్తయగు వ్యాసుని కట్టి సన్నివేశములను చిత్రించుటయం దతిమాత్ర మైన ఔత్సుక్య ముండినట్లు తోచును. మహాప్రథనసన్నివేశ ప్రధానమగు ఆగ్రంథము రచనకది తగియున్నది. కానిభాగ వతముతీరు వేరు. ఇందలి కవియాత్మీయత వేరు, వివిధ కథా సన్నివేశ పర్యవసానమందలి కావ్యన్యాయ్యము వేరు. అవి ప్రాయికముగ కరుణామూలకములై యుండును. ద్రౌపది పుత్రశోకఘట్టము భారత భాగవతములందు తత్తత్ప్రధాన తత్త్వానుసారిగనే చిత్రించబడినది. ఇది సంస్కృత భారత భాగవతముల విషయము.

ఇక నప్పట్టున భారత భాగవతాంధ్రీకర్తలెట్లు వ్యవహరించిరో యించుక పరిశీలించుట అప్రస్తుతముగాదు. ఆపట్టున భారతాంధ్రీకర్త తిక్కన మూల విధేయముగనే రచన సాగించినాడు. చూడుడు:

'అశ్వత్థామోద్ధామ రణకరణ స్మరణంబు దనచిత్తంబుత్తలపెట్టఁ గోపంబు దీపింప' ద్రౌపది ధర్మరాజుతో నిట్లనుచున్నది:

'భూరమణ గాఢనిద్రం
గూరిన సమయమున ముట్టికొని నా సుతులం
గ్రూరతఁ దెగటార్చెను బా
పారంభుఁడు గురుతనూజుఁ డక్రమలీలన్.'
'అది యాలని పెనుచిచ్చై
మదిఁ గాల్పఁదొడంగె దీనిమాన్ప నుపాయం
బు దలంప నొండు లేద
య్యదయుని ముట్టుకొని నామ మడఁచుట దక్కన్.'
'వాయుసుతుఁ బనిచి నేఁ డటు
సేయింపక తక్కితేనిఁ జెప్పెద విను మేఁ
బ్రాయోపవేశమున నీ
కాయ ముపేక్షింతుఁ జుమ్ము కౌరవనాథా'

—ఆం. భార. సౌప్తిక, II 31,32& 33.

'వ్యాసముని ప్రణీత పరమార్థము' నే భజించినాడు సోమయాజి. కాని భాగవత తత్త్వమును నవనాడులలోను జీర్ణించుకొన్న మహాకవి పోతన తానప్పట్టున మూలకర్త యడుగుజాడలలోనే నడచుచు ఆయడుగు వేయుటలో నేయొక యడుగొక క్రొత్తయొఱపుతో వేసినాడు. ద్రౌపదిచే నశ్వత్థామ నుద్దేశించి యొక సంభాషణము చేయించినాడు. అది అమూలకమైనను మనోజ్ఞమైనమార్పు. చూడుడు:

'అర్జునుండు తెచ్చిచూపిన, బాలవధ జనిత లజ్జాపరాఙ్ముఖుఁడైన కృపి కొడుకుంజూచి మ్రొక్కి సుస్వభావయగు ద్రౌపది యిట్లనియె :

పరగన్ మా మగవారలందఱును మున్
బాణ ప్రయోగోప సం
హరణాద్యాయుధ విద్యలన్నియును ద్రో
ణాచార్యుచే నభ్యసిం
చిరి, పుత్రాకృతినున్న ద్రోణుఁడవు నీ
చిత్తంబులో లేశమున్
గరుణాసంగము లేక శిష్యసుతులన్
ఖండింపఁగాఁ బాడియే ?

భూసురుఁడవు, బుద్ధి దయా
భాసురుఁడవు, శుద్ధ వీర భట సందోహా
గ్రేసరుఁడవు, శిశుమారణ
మాసురకృత్యంబు ధర్మమగునే తండ్రీ !

ఉద్రేకంబున రారు, శస్త్రధరులై
యుద్ధావనిన్ లేరు, కిం
చిద్ద్రోహంబును నీకుఁ జేయరు బలో
త్సేకంబుతోఁ జీఁకటిన్
భద్రాకారులఁ బిన్నపాపల రణ
ప్రౌఢక్రియాహీనులన్,
నిద్రాసక్తుల సంహరింప నకటా
నీచేతు లెట్లాడెనో !

అక్కట పుత్రశోకజని
తాకుల భార విషణ్ణచిత్తనై
పొక్కుచు నున్న భంగి నినుఁ
బోరఁ గిరీటి నిబద్ధుఁజేసి నేఁ
డిక్కడ కీడ్చి తెచ్చుట స
హింపనిదై భవదీయమాత నేఁ

డెక్కడ నిట్టి శోకమున
నే క్రియ నేడ్చుచుఁ బొక్కుచున్నదో!'
—అం. భాగ. I., 126-130.

ఇందలి కొన్ని భావములమూలకములు, కొన్ని మూలమున ద్రౌపది యర్జునాదులతో సంభాషించిన సందర్భము నందలివే కాని యిం దొక క్రొత్తదనమును దెచ్చుకొన్నవి. ఆ సమయమున ద్రౌపది తన కడుపున జిచ్చుపెట్టిన యా ద్రోహిని పలుకరింపక అతని తలిదండ్రులను దలచి క్షమించుటయే చాలు, నైనను తనవంటి, మహారాజ్ఞి యట్టి నీచుని పలుకరింపరాదనక పూని యతని నుద్దేశించి '...ధర్మమగునే తండ్రి, నీచేతు లెట్లాడెనో, భవదీయమాత నేఁ డెక్కడ నిట్టి శోకమున నేక్రియ నేడ్చుచుఁ బొక్కుచున్నదో' అని మాటలాడుట, ఆ యాడిన తీరులో తన పుత్రశోకాతురతను, మాతృప్రేమను, ఎదిరిపరిస్థితిని సానుభూతితో గ్రహింపగల యుదారతను (మాత్రమే) ప్రకటించి ద్రోహిని పల్లెత్తు పరుషమాడక గౌరవించిన భంగి యామె మాతృత్వప్రతిష్ఠకు మరింత వన్నెబెట్టుచున్నది. అనగా ద్రౌపదీమాతృహృదయావిష్కరణ సందర్భమున సంస్కృతాంధ్ర భారతము లొక్కతీరుగను వానిని సంస్కృతభాగవతము, దాని నాంధ్రభాగవతము నతిశయించుచు నున్నవనుట స్పష్టము.

---

# మన స్థల పురాణములు

స్థల పురాణములకే క్షేత్రమాహాత్మ్యము లనియు నామాంతరము. రసభావనిర్భరమైనభక్తి, స్వభావోక్తి సుభగములైన స్థలవర్ణనములు, ప్రతిభాసహకృతములైన ప్రకృతి వర్ణనములు వీనిలోని విశిష్టతలు. అవి యేవేవో ఆశలతో రాజుల నాశ్రయించి వారిమెప్పులకై మెరమెచ్చు లుపచరించు కవుల కృతులవంటివి కావు. అవి కవిష్టదేవతాభక్తినిష్ఠితములు కవి హృదయాగాధములను మథించిన కావ్యమందరములు. ఆయా కవుల స్వచ్ఛందమైన ఆత్మీయతా ముద్రి నచ్చొత్తు కొన్నవి. అవి పుణ్యక్షేత్రములను వర్ణించు పురాణములే యైనను చాలవరకు ప్రౌఢ విద్వత్కవుల చేతిలో బడుటవలన కథలో రసగ్రంథులు లోపించినపట్లను ఆ కవుల శయ్యా వైయాత్యము చేతనో, అపూర్వభక్తి భావవ్యక్తులవలననో, మనోహర వర్ణనల ద్వారముననో కావ్యశోభను రాబట్టు కొన్నవి.

ఈ క్షేత్రమహాత్మ్యములందు ప్రధానరసమేమి యను ప్రశ్న వచ్చునపుడు భక్తియనియే జవాబు. భక్తి ప్రసిద్ధము లగు నవరసములందు నొకటిగా చెప్పబడక పోయినను భావ మాత్రముగా కొట్టి పారవేయ దగినది కాదు. "పృథగేవ భక్తి రసరాట్ సవిస్తరేణోచ్యతే మధురః" అని భక్తిని రస ముగా ప్రతిపాదించినవారిలో ప్రథముడు రూపగోస్వామి. మధుసూదన సరస్వతి ఆ మధురరస స్వరూపమును సాంగో పాంగముగా ప్రపంచించి నిరూపించినాడు. భక్తియనగా దేవతా

విషయికమగు రతి. అనగా ఉదాత్తమైన శృంగారమన్న మాట. కావ్యమున కిక గావలసినదేమి? ఉపాఖ్యానములం దుండనేయున్నవి తదితర రసము లంగప్రాయాములై.

స్థలపురాణములు చాలమట్టుకు బ్రహ్మాండ స్కాందాది పురాణములనుండియే పుట్టినవి. బాహ్యదృష్టి కవియు పురాణముల వలెనే భాసించును, కాని పురాణధర్మ మిందు గౌణము. లక్షణప్రక్రియ బహుధా భిన్నము. అదికాక పురాణములు కథకోసము పుట్టినట్లుండును, అవి కర్తృనిరపేక్షము లైన రచనలు. ఇవి (స్థలపురాణములు) కవికోసము పుట్టినట్లుండును.

తెలుగుకవిత వేలమువెర్రిగా శృంగారప్రబంధ ఘోర ణిలో పడిపోవుచున్న కాలములో నిట్టి గ్రంథములుపుట్టి వాఙ్మయమున నొక వైవిధ్యము నుపపాదించినవి. ప్రబంధ ములు కథా ప్రధానములుగావు. అవి శబ్దప్రధానములు. అందు కథ ఆలంబనమాత్రము. అట్టిచో కథాశ్రవణ ప్రవణ మైన ప్రజాభిరుచిని కొంతకుగొంత తన కథానికలవంటి యుపా ఖ్యానములద్వారా సంరక్షించిన దీ క్షేత్రమాహాత్మ్యమే. ఈ తరగతికి చెందిన ప్రౌఢకృతులు కొన్ని ప్రబంధములుగనే పరిగణింపబడినవి. అందులకు కారణము లాశయ్యానైగ నిగ్యము, నావర్ణనాప్రాచుర్యము తెలుగున స్థలపురాణము లరవందకుపై బడియున్నవి. ఆ క్షేత్రములు చాలమట్టుకు మన తెలుగునాటికి చెందినవగుట యొక విశేషము. అందు ముఖ్యములైనవానిని గురించిన 'ముక్తసరి' ప్రసంగమిది.

శివకవులు వినా ఆంధ్రవాఙ్మయమున స్థలపురాణరచన మెత్తుకొన్నవారిలో ప్రప్రథము డెఱ్ఱాప్రెగ్గడ. అతడు శంభుదాసుడైనను వైష్ణవమైన అహోబలక్షేత్ర మాహాత్మ్యము (నృసింహ పురాణము) రచించుట గమనింప దగినది. అందుకు మూలము బ్రహ్మాండ పురాణము ఉత్తర భాగము మాత్రము పరిహరింపబడినది. కృతినాయకుడు కథానాయకుడు నొక్కడే- శ్రీ మహావిష్ణువు ఆముక్తమాల్యద యందువలె నిందును సృజింపబడిన ప్రతిపాత్ర కల్పితమైన ప్రతిసన్నివేశము నాతని యిచ్ఛా మాత్రముననే జరిగినవి. ఎన్నివర్ణనలు, ఎంత హృదయంగమముగా జేసియున్నను స్తంభములోని నరసింహస్వామియైనను సాక్షాత్కరించెను గాని అహోబలక్షేత్రము కలరూపుమాత్రము ససేమిరా గోచరించినది కాదు. ఆవర్ణనలే క్షేత్రమునకైన చెందు లుపన్యక్తిత్వకములై యున్నవి. శైలిపురాణధోరణి నున్నను ఆవర్ణనలు, వానితోపాటు వస్త్వైక్యము, ఏకనాయకాట్రియత్వము, ఆద్యంత సామరస్యము మొదలగు ప్రబంధ లక్షణము లనేకము బట్టినవి. కనుక దీనిని స్థలపురాణ మనుటకంటె అవతారమాహాత్మ్యమని కాని, ప్రాథమిక ప్రబంధమని కాని వ్యవహరించుట లెస్స. ప్రెగడయ్య ప్రబంధ పరమేశ్వరుడే కావచ్చును గాని క్షేత్రమహిమాచార్యుడు కాజాలక పోయెను.

ఆ బిరుదు డక్కగొన్న వాడొక్క శ్రీనాథుడే. అతని క్షేత్రమాహాత్మ్యములు భీమఖండము కాశీఖండము రెండును స్కాందసుధాకలశబిందువులే. అందు తొలుదొల్త 'స్కాంద

పురాణసార' మగు గోదావరీ ఖండమును గ్రహించుటలోనే యున్నది. శ్రీనాథు నాత్మీయత - ఆంధ్రాభిమానము. ఏతత్కృతికర్తయు భర్తయు కథానాయకుడు నొక్కకోవలోని వారేయైరి. దీనిని ప్రౌఢ నిర్భరవయః పరిపాకమున రచించినాడు శ్రీనాథుడు. కృతిగొన్న బెండపూడన్నమంత్రి పంచారామ పల్లవస్వామి. ఇక శ్రీనాథుని శివుడా, అతడింక కైలాసవైఖానసమౌని కాడు; 'దక్షవాటికా కటక విలాసినీ విటశిఖామణి' యైనాడు. స్థానముతో పాటాతని యాశ్రమమును మారినది. ఆ నూతనాశ్రమ ప్రదాత శ్రీనాథుడే. అదియేతరగతికృతి యైనను ఆత్మీయతాశ్రుతి బిగింపక విడువడు శ్రీనాథుడు. అట్లే 'ఆనందంబున నర్ధరాత్రముల........ మొదలగు పద్యములలో జెప్పబడిన యనుభవ మగస్త్యునిది కాదు, శ్రీనాథునిదే. ఇందు శ్రీనాథుడు. ప్రబంధ పరమేశ్వరుడు ప్రారంభించిన స్థానిక ప్రకృతి చిత్రణమునకు జీవగ్రంథులు పొదిగినాడు. అవి దక్షారామ కుమారారామ పీఠికాపుర సర్వపురవర్ణనములు. ఋతుప్రభృతి ప్రకృతి వర్ణనములు నతిమాత్రమనోజ్ఞముగా జేసి తన ప్రకృతి సౌందర్యోపాసకత్వము ఋజువు పరచుకొన్నాడు. చేపట్టిన దక్షారామ క్షేత్రమును దక్షిణకాశిగా నిరూపించిన దక్షుడు శ్రీనాథుడు.

కాశీఖండ రచనాకాలము. శ్రీనాథుని కైవ్రాలని ప్రాయము అప్పటికే 'ఆతడనేక యుద్ధముల నారియుఁ దేఱిన వృద్ధమూర్తి'. సాహిత్యరంగములో అతని గంటము గడితేరి, అనుభూతి సమగ్రమై, చిత్తము స్థిమితపడి, యూహాపరేంగితము పరాకాష్ఠనంది, పండితులకును అనుకరింపశక్యమై ప్రభవించినది

కాశీఖండము. నాటికి శివుడే విశ్వమునే శివుండ ననుచున్ జింతించు శివాద్వైతి యైనాడు శ్రీనాథుడు. కాశీఖండమున కథాశరీరము తక్కువ, ప్రకృతి వర్ణనలును దక్కువే. తీర్థ మాహాత్మ్యములు, నుపదైవతోదంతములు, శాస్త్రప్రసంగ ములు నెక్కువ. ఇందలి గుణనిధి కధ, శ్రీనాథుని కృత్యంత రము శివరాత్రి మాహాత్మ్యమునందలి సుకుమారుని కథయు తరువాతి పాండురంగ మాహాత్మ్యాది క్షేత్రగాథా గ్రంథము లందలి ధూర్త నాయకోపాఖ్యానములకు మార్గదర్శకము లాయెను. ప్రతినాయకు డెంతఘనుడైన తద్విజేత యగు నాయకునకంత యుత్కర్ష, ఎంత ధూర్తుడైన నొకడు పొర బాటున నిచ్చట చచ్చినజాలు నతనికి మోక్షము నిచ్చునని చెప్పుటవలన నాక్షేత్రస్వామి మహిమ కది పరసీమ. అదియే యేతాదృశగాథలలోని ధర్మసూక్ష్మము.

శ్రీనాధుడన్యమత సహిష్ణువైన మహాశివభక్తుడు. కాని పై రెండు కావ్యములలో నాసందర్భమునుబట్టి హృదయస్పం దియైు భక్తిపరిక్లృప్తము కావలసిన భావావేశము నతని పాండి త్యప్రకర్ష క్రమ్మివేసినది. అంతేకాక శ్రీనాధునిపై కశ్చిద్వి పశ్చిదవిచారమూలకమగు నొక అభియోగముగలదు. అతడు క్షేత్రమహాత్మ్యములనుగూడ నరాంకితముచేసిన పరోపజీవి యని అన్నవారిచాదస్తముగాని-శ్రీనాధు డిహపరముల రెండిం టినితోధికముగా సాధింపనెంచిన మేధావి.నిటలాక్షునిముందు నిలచినను తనహృదయము నున్నదున్నట్లువిప్పి చెప్పగలధీమా యతనిసొత్తు. తనస్వామి కాతడడుగునేని యతడే సమాధా నము చెప్పుకోగలడు. మనమెవరము మధ్యవర్తులము కానవ

సరము లేదు. మరియొకమాట- పై రెండుకృతులు ననువాద ములే గాని శ్రీనాథుని చేయి తగులగనే నవీయతనికి స్వీయ ములే యైపోయినవి. అతని పలనాటి వీరచరిత్రనుగూడ స్థల పురాణమనవచ్చును. ఆతరగతి కృతులందదే మొదటిది, ఈనాటికిని దానిక దేసాటి.

శ్రీనాథయుగముననే మరికొన్ని క్షేత్రమాహాత్మ్య ములును వెలసినవి. అర్వాచీనకృతులేగదా సమకాలికకృతు లును కవిసార్వభౌమ ప్రభావపరామృష్టములై యుండును. దగ్గుబల్లి దుగ్గన తన కాంచీపుర మాహాత్మ్యమును బావ గారు (శ్రీనాథుడు) కంచికోమటి సంచికట్లు సవరించునపుడు (అవచి తిప్పయసెట్టికి హరవిలాస మంకితమిచ్చువేళ అక్క డనే (కంచిలోనే) యుండి, తత్ప్రేరితుడై శివకంచిగురించి రచించియుండునని నాయూహ. పిల్లలమర్రి వారిపిన్నవాడు మాఘమహాత్మ్యము వ్రాసెనని వినికిడి. కాని పై రెండు నిప్పు డలభ్యములు ఉపలబ్ధము లగువారి గ్రంథాంతరములనుబట్టి నవియు నొకపాటి మంచికృతులే యైయుండునని యూహింప వచ్చును. ఆనాటిది భైరవకవి శ్రీరంగమాహాత్మ్య మొకటి లభించినది. కవి శైవుడు, గ్రంథము వైష్ణవక్షేత్ర గాథ, గారుడ పురాణాద్గృహీతము. ఇందు ఋతువర్ణనల నొకప్రత్యే కత. పద్యములు శ్రీనాథుని వానివలె కమ్మెచ్చులు తీసిన ట్లుండునుగాని వాని యాశాబ్దికడాంబికత్వము కావ్యపర మార్థము నతకరించినది.

రాయల యుగమున నింకొక రెండుద్దండ స్థలమాహా త్మ్యములు వెలసినవి-ధూర్జటి శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్య

ము, తెనాలి రామకృష్ణుని పాండురంగ (పౌండరీక) మాహాత్మ్యము. రెంటికిని సంస్కృత మూలములు గన్పట్టును కాని యవి రెండును కల్పితములని శ్రీ బులుసు వేంకటరమణయ్యగారి అభిప్రాయము. (చూ-గ్రంథపరిచయము, పాండురంగ మాహాత్మ్యము-వావిళ్ళ ప్రచురణ, 1952) అందు కాళహస్తి మాహాత్మ్యము శివపారమ్యమును భోధించు మహాకావ్యము. కవి భవపరాఙ్ముఖుడైన వెనుక ననగా తురీయాశ్రమమున రచించినట్లు తోచును. అప్పటి కతనికంతా శివమయమైనది. ధూర్జటికిని శ్రీనాథునకు కవితలో, జీవితములో నేకవాక్యత గోచరించును. ఇరువురును సుప్రసిద్ధములగు త్రిలింగ క్షేత్రములను గ్రహించి, మనసార తనివితీర వాని మహత్త్వము ననితర సాధారణముగా కొనియాడినవారు. కవిత్వమందును శైవకళ నొక్కతీరుగ భజించినవారు. చంద్రోదయ మిరువురి దర్శనమున లింగోద్భవమైన సందర్భ మిందులకొక నిదర్శనము.

"కాదుకాదు దయాద్రికనక కూటంబిది
డంబైన పానవట్టంబుగాని
కాదుకాదిది సుధాకర పూర్ణబింబంబు
కాశ్మీర శంభులింగంబుగాని" Etc., శ్రీ.ఖ. 11-32

'ఉదయాగ్రావము పానవట్టము —
—శీతగభస్తిబింబ శివలింగంబొప్పె ప్రాచీదిశన్'
కా.మా. 11-134

ఇతడుపురకును శివభక్తి యెంతయో స్త్రీరక్తియు నంత. అవివారి జీవితమున తీర్థమునకు దీర్థము, ప్రసాదమునకు ప్రసాదము నైనవి. చివరినాటికేని ధూర్జటి భవపరాఙ్ముఖుడాయెను. శ్రీనాథున కానాటికి చింతయైనను చచ్చినదో లేదో! ధూర్జటియు శ్రీనాథునివలె తనతత్వము దాచుకొనువాడు కాడు. ఆభక్తియు రక్తియు నాతత్త్వము నతనికెట్లు స్వభావసిద్ధములో కవిత్వము నట్లే అతని జిహ్వాకు 'నైసర్గికకృత్య' మట. అందుకే అతని భావయిత్రిలో సత్యాత్మకతయు నైశిత్యమును గలవు. అతడేవర్ణమెత్తుకొనినను అనుభవశాలివోలె జేయును. మహానగర మధ్యమున గాపురమున్నను కుటిసట్టడవిలోని కిరాత జీవిత విశేషములను, రాజభోగము లనుభవించుచున్నను దారుణ దుర్భిక్షములను యథావద్వస్తు వర్ణనా చారువులుకా చిత్రింప గలడు. అతని వాణిలోని అతులిత మాధురీమహిమ, అతని హృదయమందలి భవభక్తి భావోన్మాదము, పరివృత్తియందలి స్వాతంత్ర్యము ప్రతిఫలింపజేసికొని హృదయస్పర్శగల కావ్యములలో నుత్తమమై కాళహస్తిమాహాత్మ్య మాంధ్రవాఙ్మయమున నొక విశిష్టస్థానమును "తిష్ఠ" వేసినది. మరియొక కాళహస్తిమాహాత్మ్య మాయుగముననే వెలసినది. అది యీ ధూర్జటి మునిమనుమడు లింగరాజకవి రచించినది.

తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము గీర్వాణవాణి జటిలత నంతటిని పుణికి పుచ్చుకొని ప్రబంధపు

హుందాతో నడచి పండితులకే గుండెదడ పట్టించిన ప్రౌఢ గ్రంథము. అంత గాఢబంధముగల గ్రంథమగుట చేతనే కాబోలు కవి కారణాంతరములచే ప్రజాసామాన్యమున నంత ప్రసిద్ధుడైనను నాతని గ్రంథము మాత్రము ప్రసిద్ధము కాజాలకపోయెను. కవికి జనస్మృతిలోగల వికటకవిత్యాది బిరుద సార్థకత నతని గ్రంథముల నరయుట కాకదంత పరీక్ష. నిస ర్గముగానంత హాస్యప్రియుడు కావ్యమున నెంత నిగ్రహము చూపెను ! అది భక్తిప్రధానమైనది. అందు హాస్యమునకు తావు లేదనికాబోలు ! కాక అవియన్నియు కట్టుకథ లేనా, పుక్కిటి పురాణము లేనా ? ఆమాత్రము సెగలేకుండ నంత పొగ యుండునా ? అతనిఖ్యాతి కవి యెట్లు మూలములో, అతని కావ్యవస్తువునకు నట్లనే మూలము లోకాభి రామాయణ మేనా ?

ఈకావ్యమున కాయువుపట్టు నిగమశర్మోపాఖ్యానము. ఆంధ్రహృదయము నాకర్షించు సాంసారికమైన చక్కని యితివృత్తము నిగమశర్మ రంగంవెళ్లని రంగూన్ రౌడీ గుణనిధి సుకుమార మదాలసాదు లతనిముందు తీసికట్టు. ఆతని అక్కగారు "పేరులేని పేరంటాలే" (శ్రీ రాళ్ళపల్లి వారి Epithet) అయినను అచ్చమైన తెనుగింటి యాడుబిడ్డ, ఏనాటికిని సజీవమైనపాత్ర. (నిగమశర్మతోసహా మిగిలిన ప్రముఖపాత్రలన్నియు మోక్షమొందినవి కద !) ఈ యుపాఖ్యానమైన నుండుటచేతనే గ్రంథమున శృంగారమునకింత

ప్రసక్తి గల్గినది. ఇది కవి స్వతంత్రసృష్టి. అతని ప్రతిభకు బ్రమాణము సుశీలావృత్తాంతము, నయుతునికథయు పాత్ర చిత్రణమున చెప్పఁదగినవి. సహనశీలయగు సాధ్వీమతల్లి యామె. అతడాత్మవిశ్వాసము, పట్టుదలగల వర్ణిశిఖామణి. కథకంటె కథనవిధానమద్భుతము. శైలి 'నయాగరా'. స్థల ప్రకృతిచిత్రణమున ప్రత్యేకత లేదుగాని పురవర్ణనాదు లుదాత్తముగా నడచినవి. జాతీయములు, లోకోక్తులు, నుప మలు తక్కిన సజ్జంతయు సందర్భసుందరముగా సంఘటింప బడినది. కాని యొకమాట. ఎన్నిహంగులు చేసినను కవి పాఠకుని భావడోలికల నూపలగలడు కాని జోకొట్టలేడు. ఈ కవిదే ఘటికాచల మాహాత్మ్యమను నింకొక క్షేత్రమాహా త్మ్యముగలదు. రెండును లింగడు కృష్ణుడైన తరువాత రచింప బడినవే. పాండురంగమాహాత్మ్యము నందలి కాశీపురవర్ణన కవి పూర్వాశ్రమ సూచకమేమో!

ఆ రోజులలోనే తెనాలి రామకృష్ణుని అల్లుడు లింగమ గుంట రామకవి చతుర్వాటికా మాహాత్మ్యము, ఆనందకానన మాహాత్మ్యము రచించెను. అతని 'కవిత నిర్దుష్టమై రసవంత ముగా నున్న' దని కవిత్వవేది యభినందనము. ఇంచు మించీ కాలముననే భట్లపెనుమర్తి కోదండరామకవి యను నాతడు వల్లభాభ్యుదయ మనుపేర శ్రీకాకుళక్షేత్ర మాహాత్మ్యమును రచించెను. కథ బ్రహ్మాండ పురాణోత్తర ఖండమునుండి గ్రహింపబడినది. కవిత్వ మొకపాటిది కాని ప్రాచీనాంధ్ర

చరిత్రకు సంబంధించిన గాథలు గలదగుటచే నాదరింపదగినది.

దక్షిణాంధ్రయుగమునను క్షేత్రమాహాత్మ్యము లనేకము వెలసినవి. అందు ముఖ్యముగా జేర్కొనదగినవి కాళకవి రాజగోపాల విలాసము, కట్టా వరదరాజు శ్రీరంగ మాహాత్మ్యము, విజయరంగ చొక్కనాథుని శ్రీరంగమాఘ మాహాత్మ్యములు, నంజరాజు హాలాస్యమాహాత్మ్యము, కాశీమహిమార్థదర్పణము మొదలగునవి. రాజగోపాలవిలాసము దక్షిణద్వారకా (మన్నారుగుడి) క్షేత్రమాహాత్మ్యము. ఆలంకారిక మర్యాదాభిజ్ఞుడైన కవి క్షేత్రస్వామి శ్రీకృష్ణుని అష్టమహిషులను అష్టవిధనాయికలుగా నిరూపించి, భావప్రధానమైన శృంగారముతో, లలితోక్తి కలితముగా వర్ణించిన కృతియిది. తెలుగున శ్రీరంగమాహాత్మ్యములు చాలగలవు. అందు భైరవకవి వరదరాజుల కృతులే మున్నెన్న దగినవి. అంత భైరవకవి కృతినిగూడ కొన్నిపట్టుల నతిశయింపగలట్టిది వరదయ్యకృతి. విజయరంగ నంజరాజుల కృతులు గద్యకావ్యములట విజయరంగని కాలముననే వెలసిన మరిరెండు వచనక్షేత్ర మాహాత్మ్యములు శ్రీపతి రామభద్రకవి హాలాస్యమాహాత్మ్యము, కవిపేరు తెలియని గజారణ్యక్షేత్ర మాహాత్మ్యము. కుందుర్తి వేంకటాచలకవి కార్తికమాహాత్మ్య పద్యకావ్యముకూడ నీకాలముదే.

యక్షగానములందును నొక కొన్ని క్షేత్రమాహాత్మ్యములు గలవు. అందు దక్షిణాంధ్ర యుగముననే మధురలో

విజయరంగని కొలువున వెలసినదొకటి గలదు. అది తిరుమల
కవి చిత్రకూట మాహాత్మ్యము[1] దీనికే తిల్ల గోవిందనాటక
మనియు నామాంతరము. ఇది చిదంబర క్షేత్ర మాహాత్మ్యము.
కంచివలె చిదంబరమునకును శివకేశవు లిరువురును క్షేత్ర
స్వాములే. వారిపేర్లు కనక సభాపతి, గోవిందరాజులు. ఇందు
గోవిందరాజులు మధ్యవర్తిగా కనకసభాపతికిని, తిల్లాదేవికిని
(పార్వతి యవతారము) కళ్యాణము జరుగును. కవి విజయ
రంగ చొక్కనాథ సమ్మానితుడు. కవి శైవుడు, ప్రభువు
వైష్ణవుడవని యు, శైవవైష్ణవుల సామరస్యము నుద్దేశించియే
కవి యీ గ్రంథము రచించినట్లుతోచుచున్నది. రచనయొక
మోస్తరు. శృంగారము నంగిరినంగిరిగానున్నది. గ్రంథమునకు
నాటికాలక్షణము కొంతపట్టినది. ఇట్టి యక్షగాన క్షేత్రమాహా
త్మ్యములందు గరుడాచల, నీలాచల విలాసములు ప్రసిద్ధములు.
గరుడాచలవిలాసము హోబలకవి ప్రణీతము. మంచిపలుకుబడిగల
నిర్దుష్టము సరసమునైన రచన. మరియొక గరుడాచలవిలాస
యక్షగానమున్నది. అది యానవాఖ్యకృతము. ఉభయకృతుల
నోబయదే మేల్తరమైనది. నీలాచల విలాసము.[2] పెరుం
బూదూరి తిరువెంగళామాత్యకృతము. ఇందు ఏకాదశీవ్రత

---

1. ఇది అముద్రితము. For a descriptive note on this, Vide pp. 208 to 210 of the Descriptive Catalogue of the Tanjore Telugu manuscripts, Published by the Andhra University in 1933.

2. ఇదియు నముద్రిత మనుకొందము. రాజమహేంద్రవరము ఆంధ్రేతిహాస పరిశోధకమండలిలో నొక అసమగ్రతాళపత్త్ర ప్రతిగలదు.

మాహాత్మ్యము, యాత్రార్థము వచ్చిన భక్తురాం డ్రక్క-చెల్లెండ్రిరువురుమధ్య సాగిన సంభాషణలో నాక్షేత్రవర్ణనలు. స్తోత్రములును గలవు. కవి బంధగర్భ కవిత్వములందందె వేసిన చేయి.

అటు దక్షిణాంధ్రమున స్థలమాహాత్మ్య రచన సాగుచున్న రోజులలో నిటు ఉత్తరాంధ్రమునను గొన్ని వెలసినవి. వానిలో పేర్కొనదగినవి: ఏనుగు లక్ష్మణకవి రామేశ్వరమాహాత్మ్యము, కూచిమంచి తిమ్మకవి సర్పపురమాహాత్మ్యము, తరిగొండ వేంగమాంబ వేంకటాచలమాహాత్మ్యము, కాకరపర్తి కృష్ణకవి ముఖలింగక్షేత్రమాహాత్మ్యము, చెరకువాడ నూరయ జగన్నాథమాహాత్మ్యము, వద్దిపర్తి కోనమరాజు వేంకటేశ్వరోపాఖ్యానము, కొటికలపూడి వేంకటకృష్ణకవి శ్వేతాచలమాహాత్మ్యము, కరాలపాటి రంగయ భూతపురీమాహాత్మ్యము, పొడుగు రామబ్రహ్మము సింహాచలక్షేత్రమాహాత్మ్యము (పదము) మొదలగునవి.

ఆధునికులందును జాలమంది స్థలపురాణములు వ్రాసిరి. వానిలో పేర్కొనదగినవి కొన్ని. దేవులపల్లి సుబ్బారాయశాస్త్రిగారి మహేంద్రవిజయము (ఉపమాకామాహాత్మ్యము) నిమల సింహాచలశాస్త్రిగారి భద్రాచల మాహాత్మ్యము, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి వేదాద్రిమాహాత్మ్యము, జనమంచి శేషాద్రిశర్మగారి శ్రీమదాంధ్రహాలాస్యమాహాత్మ్యము, నందిరాజు చలపతిరావుగారి మంగళగిరి మాహా

త్మ్యము, తిరుపతి వేంకటకవుల ఏలా (నదీ) మాహాత్మ్యము మొ॥, మన వాఙ్మయమున నీకోవలో జేరునట్టి కేవల తీర్థ వ్రతాదిమాహాత్మ్యములు, క్షేత్రయాత్రా చరిత్రములు ననేకముగలవు. రానురాను వానిలో శైలి ప్రబంధపద్ధతిని, కథ వ్రితకల్ప ఫక్కినిబట్టి పోయినవి.

గ్రంథాంతరములందు ప్రాకరణికముగా పాల్కురికి సోమనాథుడు శ్రీశైలమును, కృష్ణరాయలు మధురావిల్లి పుత్తూరులను, రఘునాథరాయలు తంజాపురమును రసోత్తరముగా వర్ణించిరి. అసలు స్థానికప్రకృతి చిత్రణమే క్షేత్ర మాహాత్మ్యమునకు జీవగర్ర. భక్తి తప్పనిసరి. ఆకవులెట్టును మహాభక్తులు. వారే క్షేత్రమాహాత్మ్యములను జేపట్టియుండినను నవి యుదాత్తకృతులై యుండెడివి. ఉన్నవానిలో ఏనాటికైన శ్రీనాథ ధూర్జటి రామకృష్ణుల కృతులే సిసలైన స్థలపురాణములు. అవి ఆంధ్రవాఙ్మయకోశమున విచ్చరూపాయలు. పై చిల్లరకృతు లెన్నియు వానికి సరిపోవు.

---



మాస్టర్ మన్ ప్రింటర్సు, కాకినాడ.